## మీ అనుంగు...

# NP డబుల్ బబుల్ గమ్




## ఇప్పుడు ఇంటర్నేషనల్ ప్యాకింగ్‌లో కొత్త మెరుగులు దిద్దుకుంది

అవును నేస్తాలూ, మీకి సంతోషవార్త చెప్పాలని ఉవ్విళ్లూరుతున్నాము. మీరు ఆడుకోడానికి ఇప్పుడు బోల్డు బుడుగులు (సారీ, బుడగలు). చూశారా, ఉత్సాహంతో మాటలు కూడ తడబడుతున్నాయి. ఎందుకంటే ఉత్సాహంతో కేరింతలు కొడుతున్న మిమ్మల్ని మా డబుల్ బబుల్ గమ్ యొక్క ఇంటర్నేషనల్ రేపర్ మీద పట్టేశాముగా? అందుకని. ఇప్పుడు ఎక్కువ సేపు వుండే కొత్త పరిమళాలు, ఎక్కువ బుడగలు, మరింత మజా. పిల్లల పిడుగులకు ఎన్‌పి బుడగల వడగళ్లు.

(ప్రతి ప్యాకెట్‌లోనూ రంగు రంగుల ఫారిన్ కారు చిత్రం జామ్మని ఆటలోకి వురకడానికి.)










**ది నేషనల్ ప్రోడక్ట్స్**
135, కావల్ బైరసాంద్ర, బెంగుళూరు

NP బబుల్ గమ్‌కి మాత్రమే ఐ.ఎస్.ఐ. గుర్తు వుంది.

*Dattaram-NP-27 TEL*

# చందమామ కేమెల్ రంగుల పోటీ

ప్రవేశ రుసుము లేదు



**బహుమతులు గెలుచుకోండి**

కేమెల్ — మొదటి బహుమతి రు. 15
కేమెల్ — 2వ బహుమతి రు. 10
కేమెల్ — 3వ బహుమతి రు. 5
కేమెల్ — 5 కన్సొలేషన్ బహుమతులు
కేమెల్ — 10 సర్టిఫికెట్లు

చుక్కలు వెళ్లిన గీత వెంట కత్తిరించండి.

12 సంవత్సరముల లోపల వయస్సు గల్గిన విద్యార్థులు మాత్రమే పాల్గొన గలరు. పై చిత్రాన్ని ఏ కేమెల్ రంగుతోనైనా రంగు వేయండి. రంగు వేసిన ప్రవేశ పత్రాలను ఈ క్రింది అడ్రసుకు పంపండి.

P.B. No. 9928, COLABA, Bombay-400 005.

ఫలితములు తుది నిశ్చయముగాన, ఉత్తర ప్రత్యుత్తరములు అనుమతించబడవు.

Name ______________________ Age __________

Address ______________________________

దయచేసి మీ పేరు, చిరునామా, ఇంగ్లీషులోనే వ్రాయండి.

బొమ్మకు పూర్తిగా రంగులు వేయాలన్నది గుర్తుంచుకోండి.

ఎంట్రీలు పంపుటకు ఆఖరు తేదీ. 31-10-1979

**CONTEST NO. 11**




# కెనరా బ్యాంక్

(భారత ప్రభుత్వ సంపూర్ణస్వామ్యంలోనిది)

**లెక్కవేమీ కాదు;**
**'ఏ డిపాజిట్ అయినా**

ఈరోజు తలమీద చిన్న జడ ప్రాయలతో ఆమె చిన్న అమ్మాయి. ఈరోజు బొమ్మల కొలువుతో ఆమె వండటం తినిపించటం వంటి అన్నాలాట ఆడుతుంది. రేపు ఆమె చాలీచాలని రాబడితో ఇల్లు గడపాలంటే ఎలా భరిస్తుంది? ఈరోజే ఆమెకు తేలిక మార్గంలో ఎలా పొదుపు చేయ్యాలో, మరియు ఆమె భవిష్యత్‌కోసం మీరెలా పొదుపు చేస్తున్నారో తెలియజేయండి. కెనరా బ్యాంక్ బాలక్షేమ ఖాత చిల్లర మొల్లరగా తిరిగే అమ్మాయిని నిజమైన తెలివిగల గృహిణిగా తీర్చిదిద్దటంలో మీకు సహాయపడుతుంది.

ప్రతిదినము మీ కొనుగోలు వ్యవహారాలలో మిగిలిన చిల్లర - నాణ్యాలు - ఒక అందమైన పొదుపు పెట్టెలోవుంచి ఆ తర్వాత కెనరా బ్యాంక్‌లో డిపాజిట్ చెయ్యవచ్చు. అలలు ఏవిధంగా వాటిలోంచి అవే పెరుగుతూ పోతాయో అలాగే మీ బాలక్షేమ ఖాతా కూడా పెరుగుతూ వుంటుంది. అదంతా కలిసి ఎంత చక్కని మొత్తమయిందో చూసి మీరు ఆశ్చర్యపోతారు. ఆ! అదే కెనరా బ్యాంక్ వారి వాగ్దానం!

## లేత ప్రాయం



maa CB 15 Tel-79

# చందమామ

సంస్థాపకుడు : 'చక్రపాణి'
సంచాలకుడు : నాగిరెడ్డి

ఈ నెల బేతాళకథ [''బాదరాయణ సంబంధం'']కు ఆధారం వి. యజ్ఞరామయ్య రచన.

మానవసంబంధాలు విచిత్రంగా ఉంటాయి. రక్తబంధువుల మధ్య పచ్చిక వేస్తే భగ్గుమనవచ్చు, కాని ఆ వ్యక్తులే ఇతరులచేత సాధువులనీ, సజ్జనులనీ కీర్తిపొందటం జరగవచ్చు.

## అమరవాణి

ప్రళయే ఛిన్నమర్యాదా భవంతి కిల సాగరాః ;
మర్యాదాభేద మిచ్ఛంతి ప్రళయేపి న సాధకః.

[ప్రళయం వచ్చినప్పుడు సముద్రాలు చెలియలికట్టను (మర్యాదను) అతిక్రమిస్తాయి. కాని సజ్జనులు ప్రళయంవచ్చి పడినా మర్యాదను అతిక్రమించరు.]

సంపుటి 65 అక్టోబర్ '79 సంచిక 4

విడి ప్రతి : 1-25 : : సంవత్సర చందా : 15-00

CHITRA




ఐ. ఎల్. రాధిక, భీమవరం (ఆంధ్ర)

ప్ర: పైకి వెళ్లిన కొలది ఆక్సిజను లేదు అని శాస్త్రజ్ఞులు చెప్పెదురు. ఆక్సిజను లేనిదే అగ్ని మండదు. అట్లు అయినచో అగ్ని గుండము అగు సూర్యుడు ఎట్లు ప్రకాశించుచున్నాడు ?

స: ఈ ప్రశ్నలో రెండు అపోహలున్నాయి. ఒకటి, పైకి వెళ్ళిన కొద్దీ గాలే పల్చబడిపోతుంది. దానితోపాటు గాలిలో ఉండే ప్రాణవాయువు (ఆక్సిజన్) కూడా తగ్గిపోతుంది. రెండు, భూమిచుట్టూ ఉండే గాలిపొర కొన్ని వందలమైళ్ళు దాటదు. లక్షల కొద్దీ మైళ్ళదూరాన ఉన్న సూర్యుడు మండటానికి ఆక్సిజన్ భూమి నుంచి అందటం అసంభవం, అసలు ముఖ్యమైన సంగతి మూడోది. తగలబడటం వేరు, మండటం వేరు. ఒకటి జ్వలనమనీ, రెండోది ప్రజ్వలనమనీ అనుకోవచ్చు. తగల బడటానికి (జ్వలనానికి) ఆక్సిజన్ కావాలి, మండటానికి అవసరం లేదు. విద్యుద్దీపాలలో లోహపు తీగలు వెలుగుతాయి—తగలబడవు. తగలబడే వస్తువులు తగలబడటం పూర్తికాగానే బూడిద అవుతాయి. కొలిమిలో కాల్చితే ఇనుము ఎర్ర బడుతుంది, ఇంకా కాల్చితే పచ్చబడి, అమితమైన ఉష్ణోగ్రతలో తెల్లగా ప్రకాశిస్తూ "నీరు" కూడా అవుతుంది. సూర్యుడిలో ఉండే పదార్థం కొన్నివేల డిగ్రీల ఉష్ణోగ్రతలో ప్రజ్వలిస్తున్నది. ప్రజ్వలనానికి అవసరమైన వేడి అణుశక్తి నుంచి వస్తున్నదట. సూర్యుడిలో ఏదీ తగలబడటం లేదు.

కె. శేషాద్రిరావు, దుగ్గిరాల (ఆంధ్ర)

ప్ర: మనం విమానంలో తిన్నగా ఆకాశంలోకి, భూమి ఆకర్షణ పరిధి దాటివెళ్లి అక్కడ 12 గంటలు ఉండి, తిన్నగా మళ్ళీ క్రిందకు దిగితే, మనం ఇంకొక ప్రదేశంలో దిగుతామా ? లేక బయలుదేరినచోట దిగుతామా ?

స: భూమి ఆకర్షణపరిధి దాటి పోవటానికి ఏ విమానమూ పనికిరాదు, అంచె రాకెట్లు కావాలి. భూమి ఆకర్షకణపరిధి దాటినాక బహుశా చంద్రుడి ఆకర్షణకు గురి అవుతాం. 12 గంటల అనంతరం బహుశా మనం చంద్రుడి చుట్టూ గిరికీలు కొట్టుతూ ఉంటాం. తిరిగి భూమి మీదికి రావాలంటే చంద్రుడి ఆకర్షణ నుంచి బయటపడటానికి మళ్ళీ రాకెట్లు కావలసి ఉంటుంది!




## 76

తరవాత ఆ చదువుకున్న మూఢులు రెండు జంతువులనూ కలిపి నడిపించటానికి ప్రయత్నిస్తే, అవి కదలలేదు. అందుచేత పండితులు, తమ గురువు ఎప్పుడూ చెబుతూండినట్టు, గాడిదను నడిపించటానికి రెండు దెబ్బలు వేశారు. అది ఓండ్రపెట్ట సాగింది. ఒంటె కూడా బెదిరిపోయి అరవసాగింది. వీటి అరుపులు విని గాడిద యజమాని అయిన చాకలీ, ఒంటె యజమాని అయిన వర్తకుడూ వచ్చి, పరిస్థితి అర్థం చేసుకుని, దుడ్డు కర్రలతో నలుగురినీ బాదారు. పండితులు నలుగురూ దూరంగా పారిపోయారు.

"మనని ఆ ఇద్దరూ కొట్టారుగదా, వాళ్ళ ఉద్దేశం ఏమై ఉంటుంది?" అన్నాడు ఒక పండితుడు రొప్పుతూ.

"వాళ్ళు మూర్ఖులు. పండితుల చర్యలు వాళ్ళకు అర్థం కావు," అన్నాడు మరొకడు.

వాళ్ళు కొంత దూరం వెళ్ళేసరికి ఒక లోతైన నది వచ్చింది. దాని నిండా తుంగ ఉన్నది. నది మధ్యలో ఒక ఆకు కొట్టుకు వస్తున్నది. అది చూసి ఒక పండితుడు, "ఆగమిష్యతి యత్పత్రం తదస్మాంస్తారయిష్యతి," (ఆ వచ్చే ఆకు నది దాటిస్తుంది) అనుకుని, నదిలోకి దూకి, మెడలోతువరకూ కూరుకుపోయి, బయటికి రాలేక పోయాడు.

అప్పుడు మరో పండితుడు తన పుస్తకం తీసి, "సర్వనాశే సముత్పన్నే, అర్థం త్యజతి పండితః" అని చదివి, మొత్తం పోయేపరిస్థితిలో బుద్ధిమంతుడు సగమైనా దక్కించుకుంటాడని చెప్పి



ఉన్నది గనక, తుంగ మధ్య కూరుకు పోయిన వాడి తల నరికి తీసుకున్నాడు. ఆ తల మాట్లాడలేదని గ్రహించి, దాన్ని వదిలేసి, నది దాటలేక మరొక దిక్కుగా బయలుదేరి ఒక గ్రామం చేరారు.

వీరు పండితులుగా కనిపించే సరికి ముగ్గురు గృహస్థులు ముగ్గురినీ వేరు వేరుగా తమ ఇళ్లకు భోజనానికి పిలిచారు.

మొదటి పండితుడికి తాళ్లు తాళ్ళుగా ఉండే ఫేణీని నేతిలో వేయించి, వడ్డించారు. అది చూసి ఆ మూఢుడు, "దీర్ఘ సూత్రీ వినశ్యతి," (పొగులు నాశనం కలిగిస్తాయి) అనుకుని విస్తరి ముందు నుంచి లేచి వెళ్లిపోయాడు.

రెండోవాడికి విస్తట్లో "మండకాలు" అనే అట్లలాటివి వడ్డించారు. వాటిని చూసి ఆ మూఢుడు, "అతివిస్తార విస్తీర్ణ తద్భవేన్న చిరాయుషం," (మరీ వెడల్పయినవి చిరాయువు కలిగించవు) అనుకుని, లేచి పోయాడు.

మూడోవాడికి గారెలు వడ్డించారు. వాడు వాటిలో చిల్లులు చూసి, "ఛిద్రేష్వనర్థా బహులీ భవంతి," (చిల్లులవల్ల అనేక అనర్థాలు) అనుకుని, భోజనం మానేసి వెళ్లిపోయాడు.

ఈ విధంగా పండితులని ముందు గౌరవం పొందినవాళ్లు లోకజ్ఞానం లేని మూఢులుకావటాన నవ్వులపాలయారు.

అత్యంత లోభి ఈ కథ విని, "నువు చెప్పినది నిజమేగాని, నన్నడిగితే, మనుషులు బాగుపడటానికీ, చెడిపోవటానికీ కారణం పాండిత్యమూ కాదు, లోకజ్ఞానమూ కాదంటాను. బొత్తిగా నిస్సహాయులూ, దిక్కు లేనివాళ్ళూ తరచు దేవుడి కటాక్షంతో మనగలుగుతారు. అత్యంత బలశాలులూ, రక్షణలు గలవారూ అకస్మాత్తుగా దైవోపహతులవుతారు. నట్టడవిలో చావటం కోసం వదిలి పెట్టబడిన మనిషి దేవుడి దయ ఉంటే బతుకుతాడు. కాని అన్ని సౌకర్యాలూ గలవాడు దేవుడి అనుగ్రహం లేకపోతే

ఇంటనే చచ్చిపోతాడు. సహస్రబుద్ధీ, శతబుద్ధీ, ఏకబుద్ధీ అనేవాళ్ళ కథలు తన కన్న మేధావులైన ఇద్దరూ నశించగా, ఏకబుద్ధి తేరుకోవటం నేను చెప్పే దానికి మంచి నిదర్శనం కాదా? ఈ ప్రపంచంలో మనిషి ప్రారబ్ధాన్ని నిర్ణయించేది విధి, అంతేగాని, దురాశా, ప్రపంచజ్ఞానం లోపించటమూ కాదు.''

అతిలోభి ఆ కథ ఏమిటని అడగగా అత్యంతలోభి ఇలా చెప్పాడు :

ఒక కొలనులో సహస్రబుద్ధీ, శతబుద్ధీ అని రెండు చేపలు ఉండేవి. అందులోనే ఏకబుద్ధి అనే కప్ప ఈ చేపలతో సఖ్యంగా ఉండేది. అవి ప్రతిరోజూ సాయంకాలం ఒడ్డున కలుసుకుని, కబుర్లు చెప్పుకుని, తిరిగి నీటిలోకి వెళ్ళిపోయేవి.

ఒక సాయంకాలం ముగ్గురూ మాట్లాడుకుంటూ ఉండగా కొందరు పల్లెకార్లు వలలు చేత బట్టుకుని అటుగా వచ్చారు. వాళ్ళు కొలను కేసి చూసి, ''ఇందులో నీరు తగ్గిపోయింది. చేపలు దండిగా ఉన్నాయి. కనక మనం రేపు ఉదయం వచ్చి చేపలు పట్టుదాం,'' అని నిశ్చయించుకుని, వెళ్లిపోయారు.

పిడుగుపాటులాటి ఈ మాటలు విని ముగ్గురు మిత్రులూ కర్తవ్యం గురించి చర్చించాయి.



''సహస్రబుద్ధీ, శతబుద్ధీ! మనం ఏం చెయ్యాలి? ఇక్కడి నుంచి పారిపోవాలా? ఇక్కడే ఉండిపోవాలా?'' అని కప్ప అడిగింది.

సహస్రబుద్ధి నవ్వి, ''మిత్రమా, మాటలకు బెదరకు. పాములూ, దుర్మార్గులూ చేసే ఆలోచనలు ఎల్లప్పుడూ ఫలించవు. కనకనే ప్రపంచం నడుస్తున్నది. ఈ పల్లెకార్లు రేపు ఉదయం రాకనేపోవచ్చు. ఒకవేళ వచ్చినా, నేను నా బుద్ధిచాతుర్యంతో నన్ను రక్షించుకుని, నిన్ను కూడా రక్షించగలను. నీటిలో ఎన్ని రకాల సంచరించవచ్చునో నాకు పూర్తిగా తెలుసు,'' అన్నది.

శతబుద్ధి ఈ మాటలకు హర్షిస్తూ, "సహస్రబుద్ధి చక్కగా చెప్పింది. బుద్ధిశాలులకు ప్రపంచంలో అసాధ్యమంటూ ఏదీలేదు. అస్త్రధారులైన నందులను చాణక్యుడు తన బుద్ధికుశలతతో నిర్మూలించాడు కాడా? గాలీ, సూర్యుడూ చొరలేని చోటికి కూడా బుద్ధి చొచ్చుకు పోతుంది. అందుచేత, మనం ఈ పల్లెకార్ల మాటలు విని, మన జన్మస్థలమూ, మన తాత ముత్తాతల స్థావరమూ అయిన ఈ కొలనును విడిచిపెట్టి పోరాదు. జన్మస్థలంలో ఉంటే సౌఖ్యం కొద్దిపాటిదే అయినా, స్వర్గసౌఖ్యాలు దానికి సరిరావని పెద్దలు చెప్పరా? మనం ఈ కొలనును విడిచిపోనవసరం లేదు. నేను నా తెలివితో నిన్ను కాపాడతాను," అన్నది.

దానికి కప్ప, "మిత్రులారా, నేను కేవలమూ ఏకబుద్ధిని. నా బుద్ధి నన్ను ఇక్కడి నుంచి వెంటనే పారిపొమ్మంటున్నది. నేను నా భార్యతో సహా ఇవాళే ఇంకో కొలనుకు పోతాను," అన్నది.

మర్నాడు ఉదయం పల్లెకార్లు వచ్చి, వలలు పన్ని, మడుగులోని చేపల నన్నిటినీ పట్టారు. చేపలతోబాటు తాబేళ్ళూ, కప్పలూ, ఎండ్రలూ, ఇతర జలచరాలూ వాళ్ళకి దొరికాయి. సహస్రబుద్ధీ, శతబుద్ధీ తమ భార్యలతో సహా తప్పించుకోవటానికి తమ నేర్పునంతా ఉపయోగించి, ఎన్నిరకాల కదలినా లాభంలేకపోయింది.

పల్లెకార్లు తమకు దొరికిన వాటితో తృప్తిపడి మధ్యాన్నం దాటి ఇళ్ళకు బయలుదేరారు. బరువుగా ఉన్న కారణం చేత శతబుద్ధిని ఒక పల్లెకారి తన భుజాని కెత్తుకున్నాడు. సహస్రబుద్ధిని ఒక తాడుకు వేళ్ళాడగట్టి, ఇద్దరు పల్లెకార్లు మోసుకుంటూ వెళ్ళారు.

ఏకబుద్ధి తన కొత్త స్థావరం వద్దనుంచి ఆ పల్లెకార్లు పోతూండటం చూసి, తన భార్యతో, "చూశావా, ప్రియా. సహస్రబుద్ధినీ, శతబుద్ధినీ మనుషులు మోసుకుపోతూంటే, ఏకబుద్ధినైన నేను నిశ్చింతగా జలక్రీడలాడుతున్నాను!" అన్నది.






## 16

[భల్లూకమాంత్రికుడు, రాజు దుర్ముఖుణ్ణి క్షమించి, మాయామర్కటం కోసం వెతక సాగాడు. అంగరక్షకులు మర్కటం మంత్రి జీవగుప్తుడి దగ్గిర వున్నదని చెప్పారు. కాళీవర్మతో పాటు మాంత్రికుడు అక్కడికి బయలుదేరాడు. ఈ లోపల రాక్షసుడు ఉగ్రదండుడు, మర్కటాన్ని గదతో కొట్టేంతలో, అది గుర్రం మీది నుంచి పైకెగిరింది. తరవాత—]

మాయామర్కటుడు రాతిగదదెబ్బ తప్పుకుని, పైకెగరటం చూస్తూనే రాక్షసుడు ఉగ్రదండుడు కోపం పట్టలేక, గదను చేతికి తీసుకుని మరొకసారి వాణ్ణి కొట్టబోయేంతలో, తల మీద దెబ్బతిన్న గుర్రం పెద్దగా సకిలిస్తూ, పారిపోబోయి మరొక గుర్రాన్ని ఢీకొట్టింది. ఆ తాకిడికి గుర్రం మీది సైనికుడు కింద పడ్డాడు. మాయామర్కటుడు మెరుపు వేగంతో ఆ గుర్రం మీద ఎక్కి కూర్చుని, దాని కళ్ళాలు లాగి, నగరం కేసి తిప్పాడు.

ఉగ్రదండుడు గద పైకెత్తి మర్కటుడి కేసి బయలుదేరేంతలో, వాడు గుర్రాన్ని దూరంగా పరిగెత్తించి, మంత్రి జీవగుప్తుడితో, ''జీవగుప్తా, నువ్వేమన్న మంత్రివో గాని, నీ ఎత్తుగడ ఒక్కటీ పారలేదు. నేను ముందుగా చంద్రశిలానగరం పోయి, రాజు జితకేతుడితో యిక్కడ



జరిగినదంతా చెప్పి, నగరరక్షణకు తగిన ఏర్పాట్లు చేస్తాను,'' అన్నాడు.

మంత్రి జీవగుప్తుడు కోటలో నుంచి తన కేసి వస్తున్న భల్లూకమాంత్రికుణ్ణీ, కాళీవర్మనూ చూసి గడగడ వణికి పోతూ,'' మాయా మర్కటా, కొంచెం ఆగు! మహా బలవంతులైన రాక్షసుడూ, మాంత్రికుడూ లాంటి వాళ్ళ నుంచి నగరాన్ని ఎవరు మాత్రం కాపాడగలరు? నా మాట విను, ప్రస్తుతానికి మనం అరణ్యంలోకి పారిపోదాం,'' అన్నాడు.

''మంత్రీ, అది భీరువులు చేసేపని! నేను మాత్రం ముందు ఆ జితకేత రాజును కలుసుకోవాలి. తరవాత యీ భల్లూక మాంత్రికుణ్ణీ, కాళీవర్మనూ హతమార్చే ఉపాయం ఆలోచిస్తాను,'' అంటూ మాయామర్కటుడు గుర్రాన్ని నగరం కేసి పరిగెత్తించాడు.

రాక్షసుడు ఉగ్రదండుడు ఒకసారి గట్టిగా పళ్ళుకొరికి, ''ఒరే, మంత్రీ! నీ వెంటవున్న సైనికుల మీదగాని, యీ సామంతు సూర్యభూపతి మీదగాని, నా కెలాంటి విరోధభావం లేదు. కాళీ వర్మను ఉరి తీయించే పథకం వేసి, యీ గందరగోళాని కంతకూ నువ్వే కారకుడివయ్యావు. నిన్ను తగిన విధంగా శిక్షించాలి, ముందు గుర్రం దిగు!'' అన్నాడు.

ఉగ్రదండుడు మాట ముగించేంతలో మంత్రి జీవగుప్తుడు గుర్రాన్ని గట్టిగా అదిలించి, ''ఈ రాక్షసుడు మనల్ని విరుచుకు తినేస్తాడు. ప్రాణం మీద ఆశవున్న వాళ్ళందరూ, నా వెంటరండి,'' అంటూ నగరం కేసి బయలుదేరాడు.

సామంతు సూర్యభూపతీ, సైనికులూ కూడా మంత్రిని అనుసరించి పారి పోతున్నంతలో ఉగ్రదండుడు అందిన ఒక గుర్రం వెనక కాళ్ళు పట్టుకుని గుంజాడు. గుర్రంతోపాటు దానిమీదవున్న సైనికుడు కూడా కింద పడ్డాడు. ఉగ్ర దండుడు సైనికుణ్ణి మెడ పట్టుకుని

పై కెత్తి, "ఒరే, నీ కాళ్ళూ, చేతులూ విరిగినట్టులేదు. నువ్విటు అరణ్యం కేసి పారిపో. నగరం కన్న అదే నీకు క్షేమం," అంటూ కిందికి జార్చాడు.

అంతలో అక్కడికి భల్లూక మాంత్రికుడూ, కాళీవర్మా వచ్చారు. కాళీవర్మ నగరం కేసి పారిపోతున్న జితకేతుడి సైనికుల కేసి చూస్తూ, "ఉగ్రదండా! మంత్రితోపాటు అంతమంది సైనికులను వదిలి, యీ చచ్చు సైనికుడొక్కణ్ణి పట్టుకున్నావా? నువ్వా జీవగుప్తుణ్ణి వదల వలసింది కాదు." అన్నాడు.

భల్లూక మాంత్రికుడు నిరుత్సాహపడిపోతూ, "ఆ బుద్ధిమాలిన మంత్రి దేముందిగాని, నా మంత్రదండం దొంగిలించిన ఆ మాయామర్కటుణ్ణి బంధించినట్టయితే, నేను చాలా సంతోషించేవాణ్ణి." అన్నాడు.

రాక్షసుడు ఉగ్రదండుడు కాళ్ళల్లో పట్టులేనివాడిలా నేల మీద చతికిలబడి, రాతిగదను అంత దూరంగా విసిరివేసి, "భల్లూక మాంత్రికా! ఆ మాయామర్కటుడి ద్వారా చాలా పెద్ద దుర్వార్త విన్నాను. ఆ తాంత్రిక మిథ్యామిశ్రుడు, నా అన్నను చంపివేసినట్టు, వాడు చెపుతున్నాడు. ఈ మాట నమ్మదగిందేనా?" అని అడిగాడు.



"నీ అన్న పేరేమిటి?" అన్నాడు భల్లూక మాంత్రికుడు.

"కాలదండుడు. ఆ పేరేమైనా లోగడ విన్నావా? అతడి నివాసస్థానం కూడా నువ్వనే భల్లూకపాద పర్వత ప్రాంతాలే," అన్నాడు ఉగ్రదండుడు.

భల్లూక మాంత్రికుడు కొంచెంసేపు ఆలోచించి, తల అడ్డంగా ఊపుతూ, "ఉగ్రదండా! ఆ తాంత్రికుడు నా గురువును హతమార్చేందుకు అడ్డమైన వాళ్లందర్నీ కూడగట్టుకుంటున్నాడు. కొందర్ని తన తాంత్రిక శక్తులతో బంధించి ఊడిగం చేయిస్తున్నాడు. కాలదండుడు అన్న పేరుగల రాక్షసుణ్ణి నేనెరగను. ఒక సంగతి



గుర్తుంచుకో. కొద్దిపాటి క్షుద్రమంత్రశక్తులు గల ఆ మాయామర్కటుడి మాటలు మాత్రం నమ్మకు," అన్నాడు.

ఉగ్రదండుడు ఒకసారి శరీరం విదిలించి లేచి నిలబడుతూ, "నా అన్న బతికే వుంటాడని నా నమ్మకం. ఇప్పటికి కొన్నేళ్ళ క్రితం బ్రహ్మపుత్రానదీ లోయ ప్రాంతాలకు వచ్చిన తాంత్రిక శక్తులు గల వాళ్ళకు భయపడి నేనీ అరణ్యాలకు పారిపోయి వచ్చాను. వాళ్ళ మంత్ర తంత్రాల ముందు నా రాతి గద నిరుపయోగం. మంత్రశక్తుల్లో నీ గురువు వాళ్లను మించినవాడంటున్నావు గనక, నేను నీ వెంట ఆ ప్రాంతాలకు వచ్చి, ఆ దుష్టుల్ని సర్వనాశనం చేసేందుకు సాయపడతాను," అన్నాడు.

ఆ మాటలకు మాంత్రికుడితో పాటు కాళీవర్మ కూడా ఎంతగానో సంతోషించి, ఉగ్రదండుడితో, "ఉగ్రదండా! మనం త్వరలోనే యిక్కడి నుంచి బయలుదేరి, ఆ భల్లూక పాదపర్వత ప్రాంతాలకు పోగలం. కాని, ముందు మాయామర్కటుడి నుంచి మంత్రదండం తిరిగి సంపాయించాలి. దుష్టుడైన జితకేతరాజును తగిన విధంగా శిక్షించాలి," అన్నాడు.

ఆ వెంటనే తలారి భల్లూకుడు ఏనుగు మీది నుంచి, "దిరిసెనవన భైరవా!" అంటూ ఒక కేక పెట్టి, ముందుండి నగరం కేసి దారి తీశాడు.

ఈ లోపల గుర్రం మీద అతి వేగంగా చంద్రశిలానగరం కేసి పోయిన మాయామర్కటుడు నగర ద్వారాన్ని చేరాడు. అక్కడి కాపలా భటులు యిద్దరూ మర్కటుణ్ణి చూసి ఆశ్చర్యపోతూ, "కొండముచ్చులు గుర్రపు స్వారీ చేయటమా? ఏమి వింత!" అంటూ కత్తులను గుర్రానికి అడ్డుగా పెట్టి, "ఓయ్, అట కోతీ, నీకేమైనా మాటలు వచ్చా?" అంటూ మర్కటుడి తోక పట్టుకోబోయారు.

మాయామర్కటుడు చెవులు దిబ్బెళ్లు పడేలా కీచుమంటూ పెద్దగా అరిచి,

"ఒరే, భటాధముల్లారా! నేను ఆట కోతిని కాదు; మంత్ర శక్తులు గల తాంత్రిక భ్రాంతిమతిని, దారి తొలగండి! మీ మహారాజును పెద్ద ప్రమాదం నుంచి కాపాడబోతున్నాను." అంటూ గుర్రాన్ని అదిలించాడు.

కాపలాభటుల్లో ఒకడు ఆ మాటలకు నివ్వెరపోయి, రెండడుగులు వెనక్కు వేశాడు. కాని, రెండవ భటుడు అన్నిటికీ తెగించి, కత్తిని మర్కటుడి తలకు గురి చేసి, "నువ్వు తాంత్రికుడివో, మాంత్రికుడివో నా కనవసరం. ముందు నా వెంట మా కాపలావాళ్ళ నాయకుడి దగ్గిరకు రా," అంటూ గుర్రం కళ్లెం పట్టుకోబోయాడు.

ఆ వెంటనే మాయామర్కటుడు తన చేతగల మంత్రదండంతో కాపలాభటుడి కత్తిని పక్కకు నెట్టాడు. మంత్రదండం తాకిడికి కత్తి మెరుపులా ఒక్కసారి ధగధగమని, మరుక్షణం ఎండుపుల్లలా భగ్గుమంటూ మండిపోయింది.

కాపలాభటు లిద్దరూ ఒక చావుకేక పెట్టి పక్కకు తప్పుకున్నారు. మాయామర్కటుడు, "జై, తాంత్రికగురో!" అంటూ గుర్రాన్ని ద్వారం దాటించి, రాజవీధిని చేరాడు.

నగర ద్వారానికి కొంచెం దూరంగా గోడ పక్కన మరికొందరు కాపలాభటులతో చేరి కబుర్లాడుతున్న వాళ్ల నాయకుడు, భటుల కేకలు విని తల తిప్పి





చూశాడు. అతడికి మాయామర్కటుడు వేగంగా గుర్రం మీద పోతూండటం కనిపించింది. వెంటనే అతడు కత్తి దూసి, దాపులనున్న గుర్రం కేసి పరిగెత్తుతూ, "ఒరే, శత్రురాజుల గూఢచారి ఎవడో, కోతి వేషంతో నగరం చేరి మన రహస్యాలు తెలుసుకో చూస్తున్నాడు. వెంట పడి పట్టుకోండి!" అంటూ అరిచాడు.

కాపలాభటుల నాయకుడు తన గుర్రాన్నెక్కి బయలుదేరేలోపల మాయామర్కటుడు రాజవీధి వెంట చాలా దూరంపోయి, రాజభవనాన్ని సమీపిస్తున్నాడు. ఆ సమయంలో రాజభవనం ముందున్న మైదాన ప్రదేశంలో ఒక ఆటవికుడు కోతులూ, ఎలుగుబంట్లు లాంటి మచ్చిక చేసిన జంతువులను ఆడిస్తూ, చుట్టూచేరిన జనాన్ని ఆనందపరుస్తున్నాడు.

మాయామర్కటుడు గుర్రం మీద వేగంగా తమ కేసి రావటం చూసిన జనంలో కొందరు ఉత్సాహంగా చప్పట్లు చరుస్తూ, "ఆహా, కొండముచ్చు గుర్రపుస్వారీ! ఈ ఆటగాడెవరు?" అంటూ కేకలు పెట్టారు.

జంతువులను ఆడిస్తున్నవాడు మర్కటుడి కేసి ఓమారు చూసి, యిదేదో బాగా శిక్షణపొందిన కోతి అనీ, తన యజమాని నుంచి పారిపోయివస్తున్నదనీ అనుమానించి, చప్పున ముందుకుపోయి, ఉచ్చుతాడును మాయామర్కటుడి కంఠం కేసి గురిగా విసిరాడు. తాడు కొంచెం గురితప్పి, మర్కటుడి నడుముకు తగిలి, బిగుసుకుపోయింది. మర్కటుడు గుర్రం మీది నుంచి పల్లటీలు కొడుతూ నేలమీద పడ్డాడు. ఆ సమయంలో అతడి చేతిలో వున్న భల్లూక మాంత్రికుడి మంత్రదండం ఎగిరి అంత దూరాన పడింది.

జంతువులను ఆడించేవాడు ఎక్కడలేని ఉత్సాహంతోపోయి, మాయామర్కటుడి రెండు చెవులూ పట్టుకుని పైకెత్తి నిలబెట్టి, "కీచు, కీచు, కిచ్చన్నా!

ఈక్షణం నుంచి నీ యజమానిని నేను. చెప్పినట్టు వినకపోయావో తోకకు నూనె గుడ్డలుచుట్టి, నిప్పంటిస్తాను,'' అన్నాడు.

మాయామర్కటుడు పళ్ళుకొరుకుతూ చుట్టూ ఓమారు కలయచూసి, ''ఒరే, దిక్కుమాలిన గారడీ వెధవా! నేను మామూలు కోతిని కాదు, అద్భుతశక్తులు గల తాంత్రికుణ్ణి. మీ రాజు జితకేతుడికి రానున్న ప్రమాదాన్ని గురించి హెచ్చరించేందుకు పోతున్నాను. మధ్యలో నన్నిలా అవమాన పరుస్తావా? నీ తల కొట్టించేయగలను. నా మంత్రదండం ఎక్కడ?'' అంటూ భయంకరంగా అరిచి, గుడ్లురిమాడు.

ఆ మాటలతో జంతువుల నాడించేవాడికి భయంతో తల తిరిగిపోయింది. వాడు రెండడుగులు వెనక్కువేసి, మెడకు ఇనప గొలుసుకట్టివున్న తన ఆట ఎలుగుబంటును ముందుకు లాగుతూ, ''ఇదేదో పిశాచి కొండముచ్చు. జంతువును లొంగదీయటానికి జంతువే తగు!'' అంటూ ఎలుగుబంటును మాయామర్కటుడి మీదికి ఉసికొలిపాడు.

ఎలుగుబంటు గట్టిగా జబ్బలుచరిచి పెద్దగా నోరుతెరిచి పోయి మర్కటం మీద పడింది. మాయామర్కటుడు చావు కేకలు పెడుతూనే, ''నేను జితకేత



రాజుకు మేలుచేయ వచ్చినవాణ్ణి. అతడికి భల్లూక మాంత్రికుణ్ణుంచి ప్రమాదం రానున్నది. నా మంత్రదండం ఎక్కడ?'' అంటూ ఎలుగుబంటుపట్టు నుంచి విడిపించుకుంటూ, అందినప్పుడల్లా దానిని వాడిపళ్ళతో కొరకసాగాడు.

చుట్టూచేరిన జనం మర్కటుడి మాటలేవీ పట్టించుకోకుండా, ''ఆహా, మాటలు నేర్చిన కోతీ, మూగమొద్దు ఎలుగుబంటూ మధ్య కాటాకుస్తీ! ఇలాంటి అద్భుతం ఏనాడైనా చూశామా,'' అని ఈలలు వేస్తూ, చప్పట్లు చరచసాగారు.

అంతలో అక్కడికి గుర్రం మీద వేగంగా కాపలాభటుల నాయకుడు వచ్చి,

"ఏమిటీ చచ్చువినోదం!" అంటూ కత్తి దూసి, కొంచెం దూరంగా నిలబడివున్న జంతువులను ఆడించే వాడితో, "ఒరే, మారువేషంలో వచ్చిన శత్రుగూఢచారిని, నీ పెంపుడు ఎలుగుబంటితో చంపించాలని చూస్తున్నావా? జాగ్రత్త! ముందీ గూఢచారిని ప్రాణాలతో పట్టుకుని రాజుగారి దగ్గరకు తీసుకుపోవాలి," అన్నాడు.

కాపలావాళ్ళ నాయకుడు యిలా అనగానే, జంతువుల్ని ఆడించేవాడు చప్పున ముందుకు పోయి ఎలుగుబంటు గొలుసు పట్టుకుని యివతలికి లాగాడు. మాయామర్కటుడు శరీరానికి తగిలిన గాయాల బాధతో మూలుగుతూ, "మీ రాజును రక్షించవచ్చిన నన్ను యింత అవమానపరుస్తారా? బతకాలనివుంటే, మీ రాజునే నా దగ్గరకు రమ్మనండి! నేనెవరనుకున్నారు? గొప్ప తాంత్రికుడి శిష్యుణ్ణి! నా మంత్రదండం ఎక్కడ?" అని గుడ్లురుముతూ చుట్టూ చూశాడు.

మాయామర్కటుడు యిలా అనగానే, కాపలావాళ్ళ నాయకుడు కోపంతో పళ్లు కొరికి, "ఓరీ, శత్రుగూఢచారీ! మా మహారాజుగారు నీ దగ్గరకు రావాలా?" అని జంతువుల్ని ఆడించే వాడితో, "ఒరే, నీ ఎలుగుబంటితో పట్టించి, యీ కోతి గూఢచారిగాడిని నా వెంట రాజుగారి దగ్గరకు తీసుకురా. వాడికి ప్రాణహాని మాత్రం కలిగించకు," అంటూ రాజభవనం కేసి బయలుదేరాడు.

జంతువుల్ని ఆడించేవాడు హెచ్చరించగానే ఎలుగుబంటు మెరుపులా పోయి, మాయామర్కటుణ్ణి పడిసి పట్టుకుని భుజం మీద వేసుకుని, తన యజమాని వెనకగా రాజభవనం కేసి బయలుదేరింది. జనం ఎక్కడలేని ఉత్సాహంతో కేకలు పెడుతూ దానిని అనుసరించారు.

మాయామర్కటుడు కీచుమంటూ, "తాంత్రిక గురో, నీవే రక్ష! నా మంత్రదండం ఎక్కడ?" అంటూ అరవసాగాడు.

—(ఇంకా వుంది)






## బాదరాయణ సంబంధం

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు పద్దకు తిరిగివెళ్ళి, చెట్టుపైనుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, మనుషులు మారుతారు. వాళ్ళ అదృష్టం మారుతుంది. కాని ఈ మార్పులకు కారణాలు ఊహించటం అసంభవంగా కనబడుతుంది. ఇందుకు నిదర్శనంగా నీకు సోమనాథు డనే ప్రజ్ఞాహీనుడైన యువకుడి కథ చెబుతాను, శ్రమ తెలియకుండా విను," అంటూ ఇలా చెప్పసాగాడు:

సోమనాథుడు తన తల్లిదండ్రులకు ఒక్కడే కొడుకు. కాని వాడు తండ్రికి ఏ విషయంలోనూ అక్కరకు రాలేక పోయాడు. ఎక్కడెక్కడో తిరిగి, వాడు తిండికి మాత్రం ఇంటికి వచ్చేవాడు. తల్లి ఎన్ని విధాలనో వాడికి బోధించి, బాధ్య

## బేతాళ కథలు



తాగి, వాడు ఆకలి బాధను అదుపులో ఉంచ యత్నించాడు.

పోయి, పోయి వాడు అరణ్య ప్రదేశం చేరుకున్నాడు. అరణ్యంలోనే చీకటి పడింది. ఒకచోట వాడికి పాడుబడిన అమ్మవారి గుడి కనిపించింది. ఆకలితో శోష వస్తున్నది. తాను ఇల్లు విడిచి రావటం చాలా బుద్ధితక్కువ పని అని వాడికి తోచింది. తన భద్రత తన తండ్రి మీదా, ఆ ఇంటి మీదా ఎంతగా ఆధార పడినదీ వాడికి ఆ సమయంలో తెలిసి వచ్చింది.

తలు మప్పాలని చూసింది. కాని తల్లి మాటలు వాడి బుర్ర కెక్కలేదు. ఒక రోజు తండ్రి వాణ్ణి నానా మాటలూ అన్నాడు. ఆ మాటలు వాణ్ణి చాలా నొప్పించాయి. తన తప్పు ఏమిటో అర్థంకాని కారణంచేత వాడికి తండ్రి వైఖరి చాలా అక్రమంగానూ, అమానుషంగానూ తోచింది. అభిమానంతో వాడు అప్పటి కప్పుడే ఇల్లు విడిచి ఎటైనా పోదామని బయలుదేరాడు.

ఆ రోజంతా వాడు నడిచాడు. ఎక్కడికి పోతున్నదీ వాడికీ తెలీదు. వాడి కాళ్ళు వాచిపోయాయి. కడుపులో ఆకలి దహించుకు పోతున్నది. దొరికిన చోటనల్లా నీరు

ఇంతలో వాడున్న చోటికి ఒక బండి వచ్చి ఆగింది. అందులోనుంచి ఒక వృద్ధుడు దిగి, ఆయాసపడుతూ, "నాయనా, నాకు ఊపిరి అందటంలేదు. కాస్త ఎడ్లను విప్పి, వాటికి మేత వెయ్యి," అన్నాడు.

సోమనాథుడు లేచి వెళ్ళి, ఎడ్లను బండి నుంచి విప్పి, చెట్టుకు కట్టేసి, మేత వేసి వచ్చాడు. తరవాత ఇద్దరూ మాట్లాడుకున్నారు.

ఆ వృద్ధుడి పేరు రంగనాథుడు. ఆయన సోమనాథుడికి తన విషయం చెబుతూ, "నాయనా, నిన్ను చూస్తూంటే నా కొడుకు జ్ఞాపకం వస్తున్నాడు. వాడికి చిన్నతనంలోనే తల్లి పోతే, నేనే తండ్రీ, తల్లీ అయి,

వాణ్ణి సాకాను. వాడి మీద ఎన్నో ఆశలు పెట్టుకున్నాను. కాని వాడు బాగుపడక పోగా, పూర్తిగా చెడిపోయి, అన్ని దురల వాట్లూ నేర్చుకుని, ఘోరమైన నేరాలు చేసి, రాజభటులకు భయపడి పారి పోయాడు. అది మొదలు వాడి జాడ లేదు,'' అన్నాడు.

''జరిగిన దానికి విచారించకండి. ఏనాటికైనా మీ వాడు బుద్ధి తెచ్చుకుని తిరిగి వస్తాడు లెండి,'' అన్నాడు సోమ నాథుడు, ఇల్లు విడిచి రాగానే తన బుద్ధి ఎలా మారినదీ తెలుసు గనక.

''ఎంత చల్లని మాట అన్నావు, నాయనా! నిన్ను కన్న తల్లిదండ్రులు ఎంత పుణ్యాత్ములో!'' అంటూండగానే రంగనాథుడికి విపరీతంగా దగ్గు తెర వచ్చింది.

ఆయన అతి ప్రయత్నం మీద మాట్లా డుతూ, ''ఇక బతకను. నా చావు ఇక్కడ ఈ అడవిలో రాసిపెట్టి ఉన్నట్టున్నది. నాకు ఆస్తిపాస్తులు లేవు. ఉన్నదంతా ఈ బండీ, ఎద్దులూ మాత్రమే. వీటిని అమ్మి, నా కర్మకాండ ముగించు, నాయనా. శ్రీనివాసపురంలో నా మిత్రుడు గంగన్న ఉన్నాడు. అతనికి నా వార్త చెప్పి, అతని సహాయం పొందు,'' అని ప్రాణం విడిచాడు.

సోమనాథుడు తెల్లవారగానే సమీపంలో గొయ్యి తవ్వి, అందులో శవాన్ని పూడ్చి పెట్టి, బండి మీద బయలుదేరి, త్వరలోనే





ఒక గ్రామం చేరాడు. గ్రామం బయట బావి దగ్గిర ఎడ్లకు నీరు పెట్టి, సమీపంలో పచ్చిక మెయ్యటానికి వదిలాడు. ఇంకో పక్క రేగుచెట్టు మీద పళ్ళు కనిపిస్తే, ఆత్రంగాపోయి వాటిని కోసి తింటూ కూర్చున్నాడు.

ఆ చెట్టు యజమాని గంగన్నే. ఆయన సోమనాథుణ్ణి చూసి, "స్వేచ్ఛగా పళ్ళు కోసుకు తినేస్తున్నావు. ఈ చెట్టు సీ తాత గారి దనుకున్నావా?" అని అడిగాడు.

"అయ్యా, రెండు రోజులుగా తిండి లేదు. అందుకే నాలుగు పళ్ళు కోసుకున్నాను," అన్నాడు సోమనాథుడు దీనంగా.

గంగన్న వాడి పక్కనే కూర్చుని, "ఎక్కడికి పోతున్నావు? ఎవరి ఇంటికి?" అని అడిగాడు.

"శ్రీనివాసపురంలో గంగన్నగారి ఇంటికి పోతున్నాను. కిందటి రాత్రి రంగ నాథుడుగారు అడవిలో చనిపోయారు. గంగన్నగారనే ఆయన తన మిత్రుడని చెప్పి, ఆయన సహాయంతో ఈ బండీ, ఎద్దులూ అమ్మి, తనకు కర్మ జరిపించ మన్నారు," అన్నాడు సోమనాథుడు.

"అయ్యో, పాపం! రంగనాథం పోయాడా? అతడి కొడుకువా నువు, నాయనా? నీ కోసం అతను ఎలా బెంగ పడేవాడో తెలుసా? నీ దిగులుతోనే అతని ఆరోగ్యం దెబ్బతిన్నది," అంటూ గంగన్న కళ్ళు తుడుచుకున్నాడు.

సోమనాథుడికి కూడా కన్నీరు ఆగ లేదు.

గంగన్న వాణ్ణి తన ఇంటికి తీసుకు పోయి, తన భార్యకు వాణ్ణి రంగనాథుడి కొడుకుగా పరిచయం చేసి, "పాపం, రంగనాథుడు అడవిలో చనిపోయాట్ట! నా సహాయంతో తనకు కర్మ జరిపించ మన్నాట్ట!" అన్నాడు.

ఆమె కూడా విచారంతో కంట తడి పెట్టుకుని, సోమనాథుణ్ణి వాత్సల్యంతో చూసింది.

కర్మ ముగిసింది. గంగన్న అన్ని రోజులూ సోమనాథుణ్ణి శ్రద్ధగా గమనించాడు. కుర్రవాడు చిన్నప్పుడు అల్లరి చిల్లరగా తిరిగాడేమోగాని, ఇప్పుడు చాలా పెద్దమనిషి అయాడు. రంగనాథుడిలో ఉన్న మంచి లక్షణాలన్నీ ఈ కుర్రవాడిలో ఉన్నాయి. వాడు రెండు రోజులు తిండికి మాడి, రేగుపళ్ళు తింటుంటే తనకు కోపం వచ్చినందుకు గంగన్నకు వాడి మీద జాలీ, తన ప్రవర్తన గురించి పశ్చాత్తాపమూ కలిగాయి.

కర్మకాండ ముగియగానే సోమనాథుడు వెళ్ళిపోతానన్నాడు. కాని, అప్పటికే తన భార్యతో సంప్రతించి ఉన్న గంగన్న, "ఎక్కడికి పోతావు, బాబూ? నీకు ఆస్తి పాస్తులు లేవు గదా! ఇక మనుషులంటావా? నా కన్న మీ నాన్నకు ఆప్తుడు లేడు. అందుచేత ఈ ప్రపంచంలో అందరికన్న మా కుటుంబమే నీకు సన్నిహితమైనది. మా పిల్లనిచ్చి పెళ్ళి చేస్తాను. మా ఇంటనే ఉండిపో. నిన్ను చూస్తే నీ తండ్రిని చూసినట్టే ఉన్నది మాకు!" అన్నాడు.

సోమనాథుడు అందుకు ఒప్పుకుని, గంగన్న ఇంటి అల్లుడై, తరవాత గంగన్నకున్న కొద్దిపాటి ఆస్తికి వారసుడై, సుఖంగా జీవించాడు.



బేతాళుడు ఈ కథ చెప్పి, "రాజా, సోమనాథుడు తన అసలు తండ్రికి కొడుకుగా బొత్తిగా పనికిరాకుండా పోయి, అరఘడియ కాలంలో రంగనాథుడికి నచ్చిన కొడుకై, కొడుకు చెయ్యవలసిన విధులన్నీ రంగనాథుడికి చెయ్యటమే గాక, గంగన్నకూ, ఆ రంగనాథుడికీ ఉండిన మైత్రిని ఎలా సఫలం చెయ్యగలిగాడు? సోమనాథుడిలో మార్పు కలిగితే అది నిజమైన మార్పేనా? తాను రంగనాథుడి కొడుకును కానని గంగన్నతో చెప్పక పోవటం దుర్బుద్ధికాదా? ఈ సందేహాలకు సమాధానాలు తెలిసి కూడా చెప్పక పోయావో, నీ తల పగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "తండ్రి, కొడుకుల సంబంధాలు ఏళ్ళ మీదట చెడిపోతే అందుకు కారణాలు గుట్టలుగా పేరి ఉంటాయి. చాలా కాలంగా విరిగి ఉన్న లోహపుతలుపులను ఏ టంకమూ పూర్తిగా అతికించలేదు. సోమనాథుడికీ, తండ్రికీ పడకపోతే తప్పంతా సోమనాథుడిదే అనుకోనవసరంలేదు. తండ్రి తన పట్ల అక్రమ వైఖరి అవలంబిస్తున్నాడన్న విశ్వాసంతో వాడు ఇల్లు వదిలిపెట్టాడంటే, వాడు తనలో తప్పు ఉన్నదనుకోలేదన్నది స్పష్టం. వాడితో పోల్చితే, రంగనాథుడి కొడుకు కూడా ఇంటి నుంచి పారిపోయినప్పటికీ, తాను నేరస్థుడినని తెలిసి, తండ్రి మీద ఆగ్రహంతోగాక, రక్షకభటుల భయంతో పారిపోయాడు. ముక్కూ, మొహమూ ఎరగని రంగనాథుడితో సోమనాథుడు మంచి సంబంధం పెట్టుకోగలిగాడంటే, వాడిలో స్వతహాగా చెడ్డ లక్షణాలేవీ లేవన్నది స్పష్టం. అంతే కాదు, ఒక వంక తిండికి మాడుతూ కూడా వాడు చచ్చిపోయిన వాడికి ఇచ్చిన మాట నిలబెట్టాడు. వాడిలో స్వతహాగా దుర్మార్గం ఉంటే గంగన్న తప్పక కనిపెట్టి ఉండేవాడే; గుడ్డిగా వాడికి తన కూతుర్ని ఇచ్చి చేసి ఉండడు. ఇక, సోమనాథుడు తాను రంగనాథుడి కొడుకును కానని గంగన్నతో చెప్పకపోవటంలో దురుద్దేశం ఏమీ లేదు. కర్మకాండ పూర్తి అయేదాకా, సోమనాథుడు చచ్చిపోయిన వాడి కొడుకేనని గంగన్న నమ్మితే అనవసర ప్రశ్నలు తల ఎత్తకుండా ఉంటాయి. ఆ తరవాత తన దారిన తాను పోదామనే సోమనాథుడి ఉద్దేశం. కాని గంగన్నకు వాడిలో చచ్చిపోయిన తన మిత్రుడు కనిపించాడు. ఆయన పొరపాటును సరిదిద్ది, ఆనందాన్ని ధ్వంసం చెయ్యటం అమానుషం! అందుచేత సోమనాథుడు నిజం చెప్పలేదు," అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతో సహా మాయమై తిరిగి చెట్టెక్కాడు. —(కల్పితం)



# తెలివైన మంత్రి

శూరసేనుడనే రాజు తన పొరుగు రాజ్యం మీద దాడిచేసి, దాన్ని తన రాజ్యంలో కలుపుకోవాలనుకుని, గొప్ప మేధావి అయిన తన మంత్రిని సలహా అడిగాడు.

"మహారాజా, పొరుగు దేశపు మంత్రి నిజంగా తెలివిగలవాడైతే మనం ఆ దేశం జోలికి పోకుండా ఉండటం మంచిది. తెలివిగలవాడు కాకపోతే తప్పక యుద్ధం చేశాం," అని మంత్రి పొరుగు రాజు వద్దకు ఒక దూతను పంపాడు.

ఆ దూత పొరుగు రాజు వద్దకు వెళ్ళి, "మహారాజా, మా రాజుగారు చస్తే బతికేవాణ్ణీ, బతికితే బతికేవాణ్ణీ పంపమని మిమ్మల్ని కోరమన్నారు," అని సవినయంగా చెప్పాడు.

ఆ రాజు తన మంత్రి కేసి చూశాడు. మంత్రి ఒక తద్దినాలు పెట్టే బ్రాహ్మణ్ణీ, ఒక వైద్యుణ్ణీ దూత వెంట పంపాడు.

శూరసేనుడి మంత్రి ఆ ఇద్దరినీ ఘనంగా సత్కరించి తిప్పి పంపి, "మహారాజా, మనం యుద్ధానికి దిగటం మంచిది కాదు. ఆ మంత్రి చాలా తెలివిగలవాడు," అన్నాడు.

"ఏమిటా తెలివి?" అని రాజు అడిగాడు.

"చస్తే బతికేవాణ్ణి పంపమంటే తద్దినాలు పెట్టించే బ్రాహ్మణ్ణి పంపాడు మంత్రి. ఎవరో చస్తేగాని ఈ బ్రాహ్మడికి బతికే మార్గంలేదు. అలాగే బతికితే బతికేవాడు వైద్యుడు. రోగులను బతికించలేని వైద్యుడు బతకలేడు," అన్నాడు మంత్రి.

—సూరవరపు గోవిందరాజులు



# ఎదురు దెబ్బ

రంగాపురం జమీందారు తనకు పేరు ప్రతిష్ఠలు వచ్చేటట్టుంటేనేగాని గ్రామానికి మేలు చేసేవాడు కాడు. తాను గ్రామాధికారి అయి ఉండి కూడా ప్రజల కష్టాలను ఏ మాత్రమూ పట్టించుకునేవాడు కాడు.

ఎంతో కాలంగా రంగాపురానికి మంచినీటి బావిలేదు. గ్రామస్థులు మంచినీటికోసం చాలా దూరం వెళ్ళవలసివచ్చేది. ఒక ఏడు నీటి కరువు వచ్చి, సమస్య తీవ్రమయింది. అయినా జమీందారు బావి తవ్వించమంటే వినిపించుకోలేదు.

జమీందారు కొడుకు చందాలు వేయించి గ్రామస్థుల చేతనే పెద్ద బావి తవ్వించసాగాడు. ఎంత తవ్వినా నీరు పడకపోగా రాయి అడ్డు తగిలింది. దాన్ని పగలగొట్టి లోతు చేసే శక్తి గ్రామస్థులకు లేదు.

జమీందారు కొడుకు ఒక రాత్రి బావిలో కొంత మట్టినూనె పోయించాడు. తన గ్రామంలో మట్టినూనె పడబోతున్నదనుకుని, జమీందారు కీర్తికోసం ఎంత డబ్బయినా ఖర్చుపెట్టి, రాయి పగలగొట్టించి, బావి లోతు చేయించాడు. మంచినీరు పడింది. ఆ విధంగా రంగాపురానికి జమీందారే అనుకోకుండా మంచినీటి బావి ఏర్పాటు చేసినవాడైనాడు. — కె. బి. దత్తాత్రేయశర్మ





# మిఠాయి తినే పిశాచాలు

కొమరయ్య తల్లి వంటలు చేసి బతుకుతూ తండ్రిలేని కొడుకును పెంచింది. తల్లికి సహాయంగా ఉంటూ కొమరయ్య వంటలో మంచి నేర్పరి అయాడు. తల్లి పోగానే కొమరయ్య ఉన్న డబ్బు తీసుకుని మరో ఊరు వెళ్ళి, అక్కడ మిఠాయి అంగడి తెరిచాడు.

మొదటి రోజు బేరం బాగానే సాగింది. కాని సాయంత్రం అవుతూండగానే ఇంకో మిఠాయి అంగడివాడు తన కొట్టు మూసేసి, కొమరయ్య దగ్గిరికి వచ్చి, ''ఇంకా కొట్టు మూయలేదేం?'' అని అడిగాడు.

''అప్పుడే మూయడం దేనికి?'' అని కొమరయ్య ఆశ్చర్యంగా అడిగాడు.

''అన్నట్టు నువు కొత్తవాడివి కదూ? మా అనుభవం నీకు కూడా కలగనీ!'' అంటూ ఆ మనిషి వెళ్ళిపోయాడు.

కొమరయ్యకు విషయం ఏమీ అర్థం కాలేదు. ఇంతలో ఇంకో మిఠాయి అంగడివాడు అటుగా వెళుతూ, ''ఇంకా కొట్టు మూయలేదా?'' అని ఆశ్చర్యంగా అడిగాడు.

''నేను కొత్తవాణ్ణి. మీరంతా కంగారుగా కొట్లు ఎందుకు మూస్తున్నారో నాకు బోధపడలేదు. దయచేసి చెప్పండి,'' అన్నాడు కొమరయ్య.

ఆ మనిషి కొమరయ్యకు ఇలా చెప్పాడు:

చీకటి పడగానే ఊళ్ళోకి రెండు పిశాచాలు వస్తాయి. అవి ఏ రూపంలో వచ్చినా రావచ్చు. వాటికి మిఠాయి అంటే చాలా ఇష్టం. మిఠాయి కనిపిస్తే చాలు, అవి పళ్ళాలతో సహా ఎత్తుకుపోతాయి. అయితే అవి మూసి ఉన్న కొట్ల జోలికి పోవు.

ఈ విషయాలు చెప్పిన మనిషి, కొమరయ్యకు కొట్టు త్వరగా కట్టెయ్యమని

మాచిరాజు కామేశ్వరరావు



సలహా ఇచ్చి తన దారిన తాను వెళ్ళి పోయాడు.

కొమరయ్యకు దయ్యాలంటే భయం లేదు. తన గ్రామంలో అతను కొరివి దయ్యాలను చూశాడు. అవి ఎప్పుడూ ఎవరి జోలికీ రాలేదు. అంతకన్న దారుణంగా తడి గుడ్డలతో గొంతులు కోసే మనుషులు ఎందరో ఉన్నారు. అందుచేత అతను కొట్టు మూయక, మొండిగా కూర్చున్నాడు. కాస్సేపటికి ఇద్దరు ఆడవాళ్ళు అట్టహాసంగా కొట్టులో ప్రవేశించారు. వాళ్ళు తల్లీ కూతుళ్ళలాగున్నారు.

"రేపు రాత్రి మా అమ్మాయి పెళ్ళి. పెళ్ళికి పదిహేను గంపల మిఠాయి సిద్ధం చెయ్యగలవా?" అన్నది తల్లి కొమరయ్యతో.

ఆడమనిషి మాటలు విడ్డూరంగా ఉన్నట్టు తోచి, కొమరయ్య ఆ ఆడవాళ్ళ కాళ్ళ కేసి చూశాడు. పాదాలు వెనక్కు తిరిగి ఉన్నాయి! అవి మిఠాయి తినే పిశాచాలని అతనికి తెలిసిపోయింది.

వాడు నిండుగా నవ్వి, "మీరు ఏ మిఠాయి కోరితే అది చిటికెలో చేసి ఇయ్యగలను. కాని మీకు ఏ మిఠాయి కావాలి?" అని అడిగాడు.

పిశాచాలు రెండూ ఉన్న మిఠాయిలన్నిటినీ కొంచెం కొంచెం రుచి చూసి, "కొబ్బరి మిఠాయి బాగున్నది. పదిహేను గంపలు కొబ్బరి మిఠాయి తయారు చెయ్యి. మంచి బెల్లమూ, లేత కొబ్బరీ ఉపయోగించు!" అన్నాయి.

"ముందు కొంత డబ్బు ఇస్తే, బెల్లమూ, కొబ్బరికాయలూ కొంటాను," అన్నాడు కొమరయ్య.

తల్లి పిశాచం డబ్బుల సంచీ రొండి నుంచి తీసి కొమరయ్య చేతిలో పెట్టి, "ఇందులో అయిదు వందల రూపాయలున్నాయి. మిగిలినది రేపు మిఠాయి ఇచ్చాక ఇస్తాను," అని ఆడావుడిగా కూతురుతో సహా దుకాణంలో నుంచి బయటికి నడిచింది.

పిల్ల పిశాచం పెద్దదానితో, "వాడికి డబ్బు ఇచ్చావుదేనికి? కొనితింటేమిఠాయి నాకు చేదుగా ఉంటుంది!" అన్నది.

తల్లి పిశాచి విరగబడి నవ్వి, "వెర్రి మొహమా! కొత్తవాడి దగ్గిర ఎక్కువగా మిఠాయి రాబట్టడానికే ఈ ఎత్తు వేశాను. మనం ఇచ్చిన డబ్బుతో వాడు రేపు పదిహేను గంపల మిఠాయి తయారుచేస్తాడు. మనం రేపు వచ్చి, దూరం నుంచే నాలుకలు చాచి మిఠాయి అంతా తినేద్దాం. అది చూసి వాడు ఠారుకుని, ప్రాణాలు అరచేత పట్టుకుని పారిపోతాడు. తరవాత మనం అంగడిలో ఉన్న మిఠాయిలన్నిటితో బాటు, గల్లాపెట్టెలో డబ్బంతా తీసుకుని చక్కా పోదాం." అన్నది.

ఆ మాటలకు పిల్ల పిశాచం మొహం చాటంత అయింది.

మర్నాడు కొమరయ్య పదిహేను గంపలు కొనితెచ్చి, పెరట్లో పెట్టాడు. సాయంత్రం కాగానే అతను గాడిపొయ్యి అంటించి, పిశాచాల కోసం ఎదురు చూడసాగాడు. చీకటిపడి పిశాచాలు వచ్చాయి.

"రండి, రండి! పెళ్లికూతురికి నా శుభాకాంక్షలు!" అంటూ కొమరయ్య వాటికి ఎదురు వెళ్ళాడు.

"అవతల పెళ్ళివారు వచ్చి కూర్చున్నారు. మిఠాయి సిద్ధంగా ఉన్నదా?" అని పిశాచాలు అడిగాయి.

"మీరు ఒకసారి ఇలా రండి," అంటూ కొమరయ్య పిశాచాలను పెరట్లోకి



తీసుకు వెళ్ళాడు. అక్కడ ఉన్న పది హేను గంపలనూ చూసి పిశాచాలు ఆనందంతో కేకలుపెట్టాయి.

కాని తీరాచూస్తే అవిఖాళీగా ఉన్నాయి. "మోసం! దగా! గంపల్లో మిఠాయి ఏదీ?" అంటూ పిశాచాలు కోపంగా కళ్లు ఎర్రజేసి, కొమరయ్య మీద ఎగిరిపడ్డాయి.

"నేను చెప్పేది కాస్త వినండి. ఈ ఊరి మిఠాయి వర్తకులను రెండు పిశాచాలు పీడిస్తున్నాయట. అవి మోసం చేసి, భయపెట్టి గంపలకొద్దీ మిఠాయి కాజేస్తాయట. నా మిత్రుడు గట్టి భూతవైద్యుడు ఒకడు ఉన్నాడు. వాడు ఈ రాత్రి పిశాచాలను మారణహోమం చేస్తాడట. నన్ను గాడిపొయ్యి అంటించి ఉంచమన్నాడు. మారణహోమానికి వేపకట్టెలే కావాలిట. వాడు వాటి కోసం వెళ్ళాడు. వాడు పిశాచాలను మారణహోమం చెయ్యగానే, చిటికెలో మీ మిఠాయి తయారు చేస్తాను," అన్నాడు కొమరయ్య ఎంతో నమ్మకంగా.

భూతవైద్యుడి మాటా, మారణహోమం మాటా వినగానే పిశాచాలకు తారెత్తిపోయింది.

ఇంతలోనే ఎవరో వీధి తలుపు తట్టి, "కొమరయ్యా, అంతా సిద్ధం చేశావా? పిశాచాలు తిరిగేవేళ అవుతోంది," అని కేక పెట్టాడు. ఆ మనిషిని కొమరయ్య ముందే ఏర్పాటుచేసి ఉంచాడు.

"అడుగో, విన్నారా, మాటలోనే భూతవైద్యుడు వచ్చేశాడు!" అన్నాడు కొమరయ్య.

ఇక పిశాచాలకు అక్కడ క్షణం కూడా ఉండ బుద్ధికాలేదు. అవి నల్ల పిల్లులుగా మారి, చీకట్లోకి పారిపోయాయి.

తిరిగి ఆ పిశాచాలు ఆ ఊరి చాయల కనిపించలేదు.

"పాపం, పిశాచాల మూలంగా మీరు చాలా నష్టపోయారు," అని కొమరయ్య, పిశాచాల దగ్గిర పుచ్చుకున్న డబ్బును, ఆ ఊరి మిఠాయి వర్తకుల కందరికీ సమంగా పంచిపెట్టాడు.





# యాజ్ఞవల్క్యుడు

యాజ్ఞవల్క్యుడు విశ్వామిత్ర సంతతి వాడు. విశ్వామిత్రుడు దేవరాతుడు అనే వాణ్ణి పెంచుకున్నాడు. దేవరాతుడు కొడుకును కోరి, శివుణ్ణి గురించి తపస్సు చేశాడు. శివుడు ప్రత్యక్షమై వరం కోరుకోమంటే, దేవరాతుడు, "నీ వంటి కొడుకును ఇయ్యి," అన్నాడు.

"నా వంటివాడు ఇంకొకడు లేడు. నేనే నీకు కొడుకుగా పుట్టి, భూమి మీద శుక్ల యజుర్వేదం వ్యాపింపజేస్తాను," అన్నాడు శివుడు.

దేవరాతుడు ఇంటికి వచ్చి యజ్ఞం చేశాడు. యజ్ఞవేదిక మీద కాంతులు వెదజల్లే బాలుడు ప్రత్యక్షమయాడు. దేవరాతుడు ఆ పిల్లవాడికి యాజ్ఞవల్క్యుడు అని పేరు పెట్టి, పెంచుకున్నాడు.

యాజ్ఞవల్క్యుడు వైశంపాయనుడి శిష్యుడుగా ప్రఖ్యాతి పొందాడు. అయినా అతను ఋగ్వేదాన్నీ, సామవేదాన్నీ, అథర్వవేదాన్నీ ఇతర మునుల వద్ద నేర్చుకున్నాడనీ, యజుర్వేదాన్ని మాత్రం వైశంపాయనుడి వద్ద నేర్చుకున్నాడనీ చెబుతారు. శుక్ల, కృష్ణ యజుర్వేద శాఖలలో మొదటిదాన్ని వ్యాప్తికి తెచ్చినవాడు యాజ్ఞవల్క్యుడు.

వైశంపాయనుడు వ్యాసుడి శిష్యులలో ఒకడు. ఒకసారి వైశంపాయనుడికి బ్రహ్మహత్యా దోషం చుట్టుకున్నది. దానికి కారణం ఇలా చెబుతారు: కొందరు మునులు మేరుపర్వతానికి వెళ్ళి, ఏడు రోజులలో తిరిగి రావాలనీ, అలా రాలేకపోయినవాడికి బ్రహ్మహత్యాపాతకం చుట్టుకుంటుందనీ అనుకున్నారట; వైశంపాయనుడు అలా రాలేని కారణం చేత అతనికి బ్రహ్మహత్యా దోషం చుట్టుకున్నదట. అయితే, ఇది కట్టు కథలాగా

కనబడుతుంది. వైశంపాయనుడు నిజం గానే బ్రహ్మహత్య చేశాడు. అతను ఒక నాడు శిష్యులకు ఇంద్రవజ్రస్తవ మంత్రం చెబుతూండగా ఒక బ్రాహ్మణబాలుడు వారి మధ్యగా నడుస్తూ వచ్చాట్ట. వైశంపాయనుడు తన చేతిలో ఉన్న దర్భలతో అదిలిస్తే, అవి వజ్రాయుధమై ఆ కుర్రవాణ్ణి చంపాయట.

తన బ్రహ్మహత్యా దోషాన్ని ఎవరు తీసుకుంటారని వైశంపాయనుడు తన శిష్యులను అడిగితే, యాజ్ఞవల్క్యుడు, "నేను తీసుకుంటాను. దీన్ని నేను సులభంగా పోగొట్టుకోగలను," అన్నాడు.

వైశంపాయనుడు కోపం వచ్చి, "నీ కింత మదమా? నా విద్య నాకు ఇచ్చేసి, వెళ్లిపో!" అన్నాడు.

"నువు చెయ్యలేని పని నేను అవలీలగా చెయ్యగలను. అనగా, బ్రహ్మహత్యను ఇతరుల మీద రుద్దకుండా నా స్వశక్తితో పోగొట్టుకోగలను," అన్న మాట స్ఫురింపజేసి, గురువుకు ఆగ్రహం తెప్పించిన యాజ్ఞవల్క్యుడు గురువును మించిన శిష్యుడే. ఇతను జనకమహారాజుతో తాత్విక చర్చలు చేసి, అంతులేని ధనం పుచ్చుకుని, అనేక వందల బ్రాహ్మణ్యానికి ఆగ్రహం తెప్పించాడు.

అతను వైశంపాయనుడి వద్ద నేర్చుకున్నది వైశంపాయనుడికే ఇచ్చేసి, తరవాత సూర్యుణ్ణి ఆరాధించి, ఆయన వద్ద యజుర్వేదం నేర్చుకున్నాడట. ఇది కూడా కట్టు కథే కావచ్చు. ఎందుకంటే, వేద విభజన జరిగినాక వ్యాసుడు యజుర్వేదాన్ని వైశంపాయనుడికే నేర్పాడు. వైశంపాయనుడికీ, యాజ్ఞవల్క్యుడికీ మధ్య మూడోవాడికి స్థానం లేదు.

యాజ్ఞవల్క్యుడికి మైత్రేయీ, కాత్యాయనీ అని ఇద్దరు భార్యలు. అతను ఇల్లు విడిచి తపస్సు చేసుకోబోతూ, తన ధనమంతా ఇద్దరికీ పంచాడు. అయితే మైత్రేయి, "నువు ధనం కన్న గొప్పదాని కోసం పోతున్నావు. నాకు ధనం వద్దు," అని భర్తనుంచి తత్వోపదేశం పొందింది.







# ఇంద్రత్వం పొందిన రాజు

ఒకసారి ఇంద్రుడు విశ్వరూపుడనేవాణ్ణి చంపి, ఆ పాపానికి భయపడి పారి పోయి, ఎక్కడో సరస్సు మధ్య దాక్కు న్నాడు. ఇంద్ర పదవి ఖాళీ పడింది.





ఆ సమయంలో భూలోకాన్ని నహుషు డనే గొప్ప రాజు రాజ్యం చేస్తున్నాడు. అతను రాక్షసులను చంపి, యజ్ఞాలు చేసి, మానవోత్తము డనిపించు కున్నవాడు.





దేవతలు ఇంద్ర పదవి శూన్యంగా ఉండటం మంచిది కాదని, తమలో తాము సంప్రతించుకుని, నహుషుణ్ణి ఇంద్రుడి పదవిలో ఉంచ నిశ్చ యించారు.



నహుషుడు ఋషుల కోరికనూ, దేవతల కోరికనూ తీసివేయలేక, స్వర్గలోకానికి వెళ్ళి, ఇంద్రుడి సింహాసనం ఎక్కాడు. ఆ విధంగా ఒక మానవుడికి ఇంద్రత్వం లభించింది.



నహుషుడు కొంతకాలం నమ్రతతో వ్యవహరించాడుగాని, క్రమంగా అతనిలో అహంకారం అతిశయించింది. ఒకనాడు అతను ఇంద్రుడి భార్య అయిన శచీదేవిని చూశాడు.



నహుషుడు దేవసభలో దేవతలతో, "నేను ఇప్పుడు ఇంద్రుణ్ణి కనక, శచీదేవి నాకు భార్య కావాలి," అన్నాడు. దేవతలు దిగ్భ్రమ చెందారు.

శచీదేవి ఈ సంగతి తెలిసి ఆందోళన చెంది, దేవగురువైన బృహస్పతిని పిలి పించి, ఆయన సలహా కోరింది.







బృహస్పతి తన ఆలోచన ఆమెకు చెప్పాడు. నహుషుడు తన వద్దకు సప్తర్షులు మోసే పల్లకిలో వస్తే, తాను అతన్ని స్వీకరిస్తానని శచీదేవి కబురు చేసింది.

సప్తర్షులందరిలోనూ అగస్త్యుడు పొట్టి వాడూ, వేగంగా నడవలేనివాడూనూ. నహుషుడు తొందరగా శచీదేవిని చేరా లన్న ఆత్రంలో అగస్త్యుణ్ణి కాలితో తన్నాడు.





అగస్త్యుడు మండిపడి, తనను కాలితో తన్నిన నహుషుణ్ణి కాళ్ళు లేని పాము కమ్మని శపించాడు. నహుషుడు పామై భూమి మీద పడిపోయాడు.

అగస్త్యుడు నహుషుణ్ణి చూసి జాలిపడి, ఒక మహనీయుడి ద్వారా శాపవిమోచనం కలిగేటట్టు అనుగ్రహించాడు. ఒకనాడు ఆ పాము భీముణ్ణి పట్టుకున్నది.





ధర్మరాజు వచ్చి తన తమ్ముణ్ణి విడిపించమని పామును ప్రార్థించాడు. పాము అడిగిన ప్రశ్నలకు ధర్మరాజు సరి అయిన సమాధానాలిచ్చి భీముణ్ణి విడిపించుకోవటమేగాక, నహుషుణ్ణి శాపవిముక్తుణ్ణి కూడా చేశాడు.



# రాజైన వైశ్యకుమారుడు

ధృష్టు డనే రాజు కొడుకు, నాభాగుడు అనేవాడు, సుప్రభ అనే వైశ్యకన్యను వరించి, ఆమెను తనకిచ్చి పెళ్ళి చెయ్యమని ఆమె తండ్రిని కోరాడు. క్షత్రియ యువకుడు వైశ్యకన్యను చేసుకోవటం మంచిది కాదని సుప్రభ తండ్రి అన్నాడు. అయినా నాభాగుడు ఆమెను పెళ్ళాడతానని పట్టుబట్టాడు.

"నీకూ, నాకూ రాజు మీ తండ్రి ఉన్నాడు గదా, మనం వెళ్లి ఆయన నిర్ణయం తెలుసుకుందాం," అన్నాడు సుప్రభ తండ్రి.

ఇద్దరూ ధృష్టుడి వద్దకు పోయి, తమ తగాదా గురించి ఆయనకు చెప్పుకున్నారు. ధృష్టుడు పెళ్ళికి అభ్యంతరం చెప్పాడు.

తండ్రి నిర్ణయాన్ని కూడా లెక్కచెయ్యక, నాభాగుడు సుప్రభను రాక్షస పద్ధతిని ఎత్తుకువచ్చి, పెళ్ళాడాడు. సుప్రభ తండ్రి ధృష్టుడి వద్ద ఫిర్యాదు చేశాడు. ధృష్టుడు తన కొడుకుతోనే యుద్ధానికి తలపడ్డాడు. వారిద్దరూ యుద్ధం చేస్తూండగా ఒక పరివ్రాజకుడు అటుగా వచ్చి, యుద్ధ కారణం అడిగి తెలుసుకుని, "నాభాగుడు వైశ్యస్త్రీని పెళ్ళాడి వైశ్యుడయాడు. క్షత్రియుడు వైశ్యుడితో యుద్ధం చెయ్యరాదు," అని ధృష్టుడికి ధర్మం తెలిపాడు.

తండ్రి కొడుకుల మధ్య యుద్ధం ఆగిపోయింది. ధృష్టుడు నాభాగుణ్ణి వైశ్య వృత్తులే అవలంబించమని ఆజ్ఞాపించాడు. నాభాగుడు వైశ్యవృత్తులే అవలంబిస్తూ వచ్చాడు.

నాభాగుడికి సుప్రభ వల్ల భనందుడు అనే కొడుకు కలిగాడు. భనందుడు పెరిగి పెద్దవాడవుతూ, "నేను ఏ వృత్తి

అవలంబించను ?'' అని తన తల్లిని అడిగాడు.

"గోవులను కాయి,'' అన్నది సుప్రభ భనందుడితో.

''గోరూపిణి అయిన భూమిని శత్రు రాజులు పాలిస్తున్నారు. నేను దాన్ని ఎలా పాలించను ?'' అనుకుని భనందుడు ఆ భూమిని సంపాదించాలని నిశ్చయించుకున్నాడు.

అతను ఈ ఉద్దేశంతో హిమాలయానికి వెళ్ళి, అక్కడ నీపుడు అనే రాజర్షిని కలుసుకుని, అతనికి తన సమస్య తెలియజెప్పాడు.

నీపుడు అస్త్రవిద్యలు బాగా తెలిసినవాడు. ఆయన సంతోషంగా భనందుడికి తనకు తెలిసిన విద్యలన్నీ కొద్ది కాలంలోనే నేర్పాడు.

అస్త్రవిద్యలు అభ్యసించి భనందుడు తిరిగి వచ్చేసరికి, ధృష్టుడు చనిపోయి, నాభాగుడి తమ్ముడి కొడుకు వసురాతుడు రాజ్యం ఏలుతున్నాడు. భనందుడు వసురాతుణ్ణి, తన తండ్రి భాగమైన అర్ధ రాజ్యాన్ని అయినా తనకియ్యమని అడిగాడు.

వసురాతుడు అందుకు ఒప్పుకోక, "నీ తండ్రి వైశ్యస్త్రీని పెళ్ళాడి, వైశ్యుడై, రాజ్యార్హత లేకుండా చేసుకున్నాడు. అతనికి లేని రాజ్యార్హత నీకెక్కడి నుండి వస్తుంది. నీకు అర్ధరాజ్యం ఇయ్యను,'' అన్నాడు.

భనందుడు వసురాతుడితో యుద్ధంచేసి ఆ యుద్ధంలో వసురాతుణ్ణి చంపి, పూర్తి రాజ్యమే సంపాదించుకున్నాడు. అయితే దాన్ని అతను తానే స్వయంగా పాలించక, తన తండ్రి అయిన నాభాగుణ్ణి పాలించమని కోరాడు.

కాని నాభాగుడు తాను రాజ్యార్హుడు కాదని చెప్పి, ''నువు గెలుచుకున్న రాజ్యంగదా, దాన్ని నువే పాలించుకో,'' అన్నాడు.

ఆ విధంగా, వైశ్యుడుగా పుట్టిన భనందుడు తిరిగి రాజయాడు.





# స్వాములవారి జాతకం

మాణిక్యపురానికి ఒక స్వాములవారు ఇద్దరు శిష్యులతోసహా వచ్చి, ఊరి చివర ఒక కుటీరంలో బసచేసి, ఊరి వారికందరికీ జాతకాలుచెప్పి, డబ్బు వసూలు చెయ్యసాగాడు. ఆయన దినచర్య ఏమంటే, రోజూ ఉదయం ఒక గంట సేపు ఊరి వాళ్ళు తమ జాతకాలు తెలుసుకోవటానికి వచ్చినప్పుడు, వారి గతం యావత్తూ ఉన్నది ఉన్నట్టు చెప్పి, తరవాత భవిష్యత్తు గురించి వారు కోరినది చెప్పేవాడు. ఆయన ఊరికి కొత్తవాడైనా, ఊరి వారు ఎవరు వచ్చి అడిగినా, వారి పేరు ఒక కాగితం మీద రాసుకుని, లోపలి గదిలోకి వెళ్ళి, కొంతసేపు ఉండి, కాగితం మీద వారి పుట్టు పూర్వోత్తరాలు రాసుకు వచ్చి చదువుతాడు. అందులో ఒక్క పొరపాటు కూడా ఉండదు. తరవాత స్వాములవారు భవిష్యత్తుచెబుతాడు.

ఊళ్ళో ఎవరి పేరు ఇచ్చినా స్వాముల వారు వారి గతం ఉన్నది ఉన్నట్టు చెప్పటంతో ఊరివారందరికీ ఆయన మీద అమితమైన గురి కుదిరింది. జనం వేలం వెర్రిగా ఎగబడి, స్వాములవారు జాతకాలకు కేటాయించే గంట కాలంలో తమ జాతకాలు చెప్పించుకునేటందుకు ఆరాటపడ్డారు.

ఈ స్వాములవారి ఎత్తుగడలో ఏదో మోసం ఉన్నదని వినోదుడు అనే యువకుడికి అనుమానం కలిగింది. అతని అనుమానానికి కారణం లేకపోలేదు. స్వాములవారు జాతకం అడిగిన మనిషి పేరు రాసుకుని లోపలికి పోతాడు. పోయినవాడు కొంతసేపటికిగాని బయటికి రాడు. బయటికి వచ్చినవాడు జాతకుడి పూర్వ జీవితం వివరాలు నోటితో చెప్పక, కాగితం మీద రాసుకువచ్చి చదువుతాడు.

బొమ్మిడి అచ్చారావు



స్వాములవారు లోపలికి వెళ్ళేటప్పుడు ఒక శిష్యుడు ఆయనతో బాటు తాను కూడా లోపలికి పోతాడు.

"స్వాములవారు లోపలికి పోయి వెంటనే రారుగదా, అంతసేపు లోపల ఏం చేస్తారు ?" అని వినోదుడు రెండో శిష్యుణ్ణి అడిగాడు.

"వారు సమాధిలోకి వెళ్ళి, జాతకుడి భూత భవిష్యత్తులు తెలుసుకుంటారు," అన్నాడు శిష్యుడు.

వినోదుడు తృప్తిపడలేదు. అతనికి ఇంకో సందేహం ఏమంటే, సన్యాసం పుచ్చుకున్నవాడు జాతకాలు చెప్పి, డబ్బు ఎందుకు వసూలు చేస్తాడు.

ఇంతకన్న కూడా ముఖ్యమైన విషయం ఏమిటంటే, స్వాములవారు జరగబోయేది చెబుతున్నాడుగదా, అది నిజం అవుతున్నదా ? దాన్ని గురించి ఆరాతీసినవాడు లేడు. "ఈ స్వాములవారి జాతకం ఏమిటో నేను తేలుస్తాను," అనుకున్నాడు వినోదుడు.

ఊరు మాటుమణిగినాక అతను స్వాములవారి కుటీరం సమీపంలో మాటు వేయనారంభించాడు. ఒక రాత్రి స్వాములవారు తన శిష్యులతో, "ఇక ఈ ఊళ్ళో దాదాపు అందరి జాతకాలూ చెప్పినట్టే. అందుచేత మీరు తీరికవేళలో పక్క ఊరిలో భిక్షాటనకు వెళ్ళి, అందరి వివరాలూ రాసుకురండి. వేషం జాగ్రత్తగా వెయ్యండి. మనం ఆ వూరు వెళ్ళినప్పుడు మిమ్మల్నెవరూ గుర్తు పట్టరాదు!" అనటం వినోదుడు విన్నాడు.

స్వాములవారి రహస్యం అనుకున్న దానికన్న చాలా సులభంగా తెలిసిపోయింది. స్వాములవారు పోదలచుకున్న ఊరికి శిష్యులు ముందుగానే వెళ్ళి, ఆ ఊరివాళ్ళ వివరాలన్నీ చిఠా రాసుకు వస్తారు. జాతకం అడిగినవాడి పేరు రాసుకుని స్వాములవారు ఒక శిష్యుడితో లోపలికి వెళ్ళి, వాడి సహాయంతో జాతకుడి వివరాలు చిఠా నుంచి ఎత్తి రాసు

కుని బయటికి వచ్చి, దాన్ని చదివి జాతకుడికి తనలో పూర్తి విశ్వాసం కలిగించుకుని, నోటికి వచ్చినట్టు భవిష్యత్తు చెప్పి పంపేస్తాడు. అది అబద్ధమని తేలేలోపల స్వాములవారు ఊరే దాటిపోవచ్చు. ఈలోపలే అది అబద్ధమైనా ఆ జాతకుడు స్వాములవారికి విరుద్ధంగా ఎవరికీ చెప్పి, తాను నవ్వులపాలు కావటానికి సిద్ధపడడు. ఒకవేళ వాడు స్వాములవారి మాట అబద్ధమని చెప్పినా ఎవరూ నమ్మరు. అవి నోటి మాటలే గనక జాతకం చెప్పించుకున్నవాడికి తప్ప ఎవరికీ జ్ఞాపకం ఉండవు.

కుటీరంలో అందరూ గాఢనిద్రలో పడిపోయేదాకా వేచి ఉండి, వినోదుడు లోపల ప్రవేశించి, అంతటా వెతికాడు. అతనికి మాణిక్యపుర వాసుల చిట్టా పుస్తకం తేలికగా దొరికింది. ఒక సంచీలో పెట్టుడు గడ్డాలూ, మీసాలూ కూడా దొరికాయి. వినోదుడు వాటిని తీసుకుని, బయటికి వచ్చి, ఇల్లు చేరుకున్నాడు.

మర్నాడు వినోదుడు స్వాములవారి వద్దకుపోయి, తనజాతకంచెప్పవలసిందని కోరాడు. అతనిలాగే అడిగిన మరి ముగ్గురి పేర్లు కూడా కాగితం మీద రాసుకుని స్వాములవారు కుటీరం లోపలికి వెళ్లాడు. ఆయన వెంట లోపలికి వెళ్ళిన శిష్యుడు కొద్ది క్షణాలకే తిరిగి వచ్చి, "స్వాముల వారికి అస్వస్థతగా ఉన్నది. మీ జాతకాలు రేపు చెబుతారు." అన్నాడు.



"అయ్యయ్యో! పాపం, ఇప్పుడు బాగానే ఉన్నారే? ఇంతలో ఏమయిందీ? పదండర్రా, చూద్దాం!" అని అందర్నీ కూడగట్టుకుని, వినోదుడు కుటీరంలోకి జొరబడ్డాడు.

ఒక్కసారిగా లోపలికి వచ్చిన జన సమూహాన్ని చూసి, స్వాములవారు కంగారుపడి, "కొద్దిపాటి అస్వస్థత! మీ జాతకాలు రేపు చెబుతాను," అన్నాడు.

"అదేం కుదరదు! ఇప్పుడే చెప్పాలి," అన్నాడు వినోదుడు మొండిగా. స్వాముల వారికి ఆగ్రహం వస్తుందని మిగిలినవాళ్లు భయపడ్డారు గాని, స్వాములవారు ఏమీ చెప్పలేని స్థితిలో ఉన్నట్టు కనబడ్డాడు.

"నా జాతకం మాట వదిలెయ్యండి. మిగతా ముగ్గురి జాతకాలూ నేను చెప్పనా?" అంటూ వినోదుడు తన పైబట్ట లోపలి నుంచి చిరాపుస్తకం తీసి, తెరిచాడు.

స్వాములవారికీ, శిష్యులకూ పై ప్రాణాలు పైనే పోయాయి.

వినోదుడు పేరు పేరునా ఒక్కొక్కరి వివరాలూ చదవనారంభించాడు. అందరూ నిర్ఘాంతపోయి వింటున్నారు. వాళ్ళకు చిరాపుస్తకం రహస్యం అంతు బట్టలేదు. వినోదుడు ఆ పుస్తకం పుట్టు పూర్వోత్తరాలు విశదీకరించాడు. కొంత మంది తమను గురించి ఆ పుస్తకంలో రాసి ఉన్న విషయాలు చదివి చూసుకుని, నిజం తెలుసుకున్నారు.

తరవాత వినోదుడు సంచీలో నుంచి పెట్టుడు గడ్డాలూ, మీసాలూ పైకి తీసి, స్వాములవారి శిష్యులకు తగిలించాడు.

వెంటనే జనం వాళ్ళను పోల్చుకుని, "అవును! వీళ్ళే కొంతకాలం క్రితం మన ఊరికి వచ్చారు. గడ్డాలు లేకపోయే సరికి పోల్చుకోలేకపోయాం!" అన్నారు.

నాలుగు ఉతికేసరికి, స్వాములవారూ, శిష్యులూ నిజం ఒప్పుకున్నారు. తరవాత గ్రామస్థులు వాళ్ళను ఊరి నుంచి తరిమేసి, తమ జాతకాల పిచ్చి తమను పిచ్చివాళ్ళను చేసిందని గ్రహించారు.



# కురూపి

ఒక వ్యాపారికి ఒక కురూపి అయిన కూతురు ఉండేది. పెళ్ళీడు వచ్చాక, వ్యాపారి ఆ అమ్మాయికి ఎన్నో సంబంధాలు చూశాడు, కాని ఆమెను పెండ్లాడుతామని ఎవరూ ముందుకు రాలేదు. అల్లుడికి వ్యాపారి డబ్బూ, ఇల్లూ ఏర్పాటు చేస్తానన్నా పని జరగలేదు.

చివరకు వ్యాపారి తన కుమార్తెను తమ బంధువర్గంలో ఒక గుడ్డివాడికి ఇచ్చి పెళ్ళి చేశాడు.

కొంతకాలం గడిచింది. ఆ ఊరికి ఒక గొప్ప నేత్ర వైద్యుడు వచ్చాడు. అతను శస్త్ర చికిత్స చేసి, అనేకమంది గుడ్డివాళ్ళకు దృష్టి తెప్పిస్తున్నాడు.

బంధువులు వ్యాపారితో, "మంచి అవకాశం! నీ అల్లుడికి కళ్ళు తెప్పించు," అన్నారు.

వ్యాపారి తల అడ్డంగా తిప్పి, "సుఖంగా సాగిపోతున్న కాపరాన్ని చేజేతులా కూలదోయలేను. కళ్ళు వస్తే నా అల్లుడు నా కూతురి ముఖం చూస్తాడా? కురూపి భార్యకు గుడ్డి భర్తే జత!" అన్నాడు.

—భానుమతి





# తగిన వరుడు

వైశాలీనగర రాజైన ప్రతాపరుద్రుడికి సూర్యకుమారి ఒకతే సంతానం. అందుచేత అతను ఆమెనే కొడుకు అనుకుని, ఆమెకు ఇతర చదువుతోబాటు యుద్ధ విద్యలన్నీ నేర్పించాడు. ఆమె అన్ని యుద్ధవిద్యలలోనూ అసామాన్య ప్రజ్ఞ సంపాదించింది.

సూర్యకుమారికి యుక్త వయసు వచ్చింది. తన అనంతరం రాజ్యపాలనం చేయవలసి ఉన్న తన కుమార్తెకు ఎలాటి భర్తను ఎన్నిక చెయ్యాలన్నది ప్రతాపరుద్రుడికి సమస్య అయింది. ఆమెను చేసుకునే రాజకుమారుడు యుద్ధవిద్యలలో ఆమెను మించగలవాడైతే, చుట్టుపక్కల ఉండే రాజులలో, వైశాలి నగరాన్ని ఒక ఆడది పాలిస్తున్నదన్న తేలిక భావం ఉండదని ప్రతాపరుద్రుడు అనుకుని, యుద్ధవిద్యలలో తన కుమార్తెను ఓడించగలవారికే ఆమె నిచ్చి పెళ్లి చేస్తానని దేశ దేశాలకూ వర్తమానం పంపాడు.

స్వయంవరం శుభ దినానికి అనేక మంది రాజులూ, రాజకుమారులూ వైశాలీ నగరం చేరారు. స్వయంవరానికి వచ్చిన వారిలో ఇద్దరు ఆటవికులు కూడా ఉండడం చూసి, ప్రతాపరుద్రుడు ఆశ్చర్యపోయాడు. రాజకుమారితో రాజ వంశం వారే పోటీ చేయాలని ఆయన నియమం పెట్టలేదు గాని, ఈ ఆటవికులకు తన కుమార్తెతో పోటీచేసే అవకాశం ఇయ్యరాదని ఆయన నిశ్చయించుకున్నాడు.

కాని ఆ నిర్ణయం నిరుపయోగమైపోయింది. ఎందుచేతనంటే స్వయంవరానికి వచ్చిన రాజులూ, రాజకుమారులూ సూర్యకుమారితో అన్ని యుద్ధ విద్యలలోనూ పోటీ చేసి, అన్నిటిలోనూ ఓడిపోయారు. ఆ కారణంచేత ఆమెతో

రాంబాబు

వీరమల్లూ, నాగమల్లూ అనే ఆటవికులను పోటీ చెయ్యనియ్యక తప్పలేదు.

"వీళ్ళను మరింత పట్టుదలగా ఓడించు!" అని ప్రతాపరుద్రుడు తన కుమార్తెను రహస్యంగా హెచ్చరించాడు. ఈ హెచ్చరిక కూడా నిరుపయోగమయింది. వీరమల్లు అన్ని యుద్ధ విద్యలలోనూ సూర్యకుమారిని ఓడించాడు!

ఆ వీరమల్లుకు తన కుమార్తెను పెళ్లి చెయ్యకుండా తప్పించుకోవటానికి మార్గం ఏమిటా అని ఒక వంక రాజు మధనపడి చస్తూంటే, వీరమల్లు తనకూ సూర్యకుమారికీ పెళ్ళి ప్రకటించమని తొందర చెయ్యసాగాడు.

ఇంతలో నాగమల్లు, "మహారాజా, పోటీదారులలో నేనింకా మిగిలి ఉన్నాను. నాకు అవకాశం ఇయ్యకుండా ఈ వీరమల్లుకు రాజకుమార్తెను ఎలా పెళ్ళి చేస్తారు?" అని పేచీ పెట్టాడు.

"అదీ నిజమే! నువ్వూ, వీరమల్లూ పోట్లాడండి, ఎవరు గెలుస్తారో చూతాం." అన్నాడు ప్రతాపరుద్రుడు. ఇద్దరు ఆటవికులూ పోటీ చెయ్యటంలో నాగమల్లు గెలిస్తే, ముందు వీరమల్లు బెడద వదులుతుందనీ, ఆ తరవాత నాగమల్లును వదిలించుకోవటానికి మరో ఎత్తు వెయ్యవచ్చుననీ, "నువు ఓడించినది రాజకుమార్తెను



కాదు గనక నీకు రాజకుమార్తె నియ్యను." అనవచ్చుననీ రాజు చాలా ఆశపడ్డాడు.

కాని వీరమల్లు నాగమల్లుతో పోటీ చేయ నిరాకరించుతూ, "నేను రాజకుమార్తెతో పోటీ చేసి ఆమెను పెళ్ళాడదామని వచ్చానుగాని, పోటీదారులతో పోటీ చేసి, శత్రుత్వాలు కలిగించుకోవటానికి రాలేదు." అనేశాడు.

వాడి వాదనను అందరూ ఆమోదించారు. అందుచేత రాజు తన కుమార్తెను నాగమల్లుతో కూడా పోటీ చెయ్యనియ్య వలసి వచ్చింది.

ఆ పోటీలో సూర్యకుమారి నాగమల్లు చేతిలో కూడా ఓడిపోయింది!

ప్రతాపరుద్రుడి ప్రాణం కుదట పడింది. తన కుమార్తె ఇద్దరిని పెళ్ళాడ లేదు గనక స్వయంవరం పోటీ రద్దు అయినట్టు భావిస్తున్నానన్నాడు.

కాని అందుకు మిగిలిన పోటీదార్లు ఒప్పుకోలేదు: "మేం చాతనైతే రాజకుమార్తెను పెళ్ళాడడానికీ, చాతకాక పోతే కనీసం ఆమె పెళ్లి చూడడానికీ వచ్చాంగాని, ఉత్తగా మా దేశాలకు తిరిగి పోవటానికి రాలేదు. తనను ఓడించిన ఇద్దరిలోనూ ఎవరినో ఒకరిని రాజకుమార్తె వరించి, పెళ్ళాడవచ్చును. ఇదే న్యాయమైన పద్ధతి," అన్నారు.

రాజకుమార్తె నిర్ణయం మర్నాడు దర్బారులో ప్రకటించబడుతుందనీ, అందరూ దర్బారులో మర్నాడు ఉదయం హాజరు కావలిసిందనీ రాజు చెప్పాడు.

ఆ రాత్రి వీరమల్లు రహస్యంగా రాజును కలుసుకుని, సూర్యకుమారి వింటూండగా, "మహారాజా, నేను కుంతల దేశపు రాజైన కేతువర్మ కుమారుణ్ణి. నా పేరు జయసింహుడు. సూర్యకుమారికి మంత్ర శక్తులున్నాయనీ, మామూలు మానవులు ఆమెను యుద్ధవిద్యలలో జయించలేరనీ విని, రాజకుమారుడుగా ఆమె చేతిలో ఓడిపోతే నాకూ, నా తండ్రికీ, మా దేశానికీ తీరని అవమానం జరుగుతుందని ఆటవికుడి వేషంలో రావటం జరిగింది. నాగమల్లు మాత్రం నిజమైన ఆటవికుడు. అతడి తండ్రి ఆటవికుల నాయకుడు. అందుచేత రేపు సభలో రాకుమారి నా మెడలోనే వరమాల వేసిన పక్షంలో మీకూ, మీ వంశానికీ అపఖ్యాతి రాకుండా ఉంటుంది. ఈ మాట చెప్పడానికే వచ్చాను," అని సెలవు పుచ్చుకుని, తన బసకు వెళ్ళిపోయాడు.

తనతో పోటీ చేసి ఓడిపోవటానికి సిగ్గుపడి, తన వంశాన్ని కూడా రహస్యంగా ఉంచిన వాడి మెడలో చూస్తూ, చూస్తూ వరమాల వెయ్యలేక, సూర్యకుమారి మర్నాడు నిండు సభలో నాగమల్లు మెడలో వరమాల వేసి, అతన్నే పెళ్ళాడింది.



# యోగ్యత

ఒక రాజుగారు వైద్యం నేర్చుకున్న విద్యార్థులు తమ గురువుల వద్ద యోగ్యతాపత్రాలు తెస్తే, వారిని గ్రామాలలో జీతం మీద అధికార వైద్యులుగా నియమిస్తున్నాడు.

అది తెలిసి ఉద్రేకుడు అనేవాడు ఒక వైద్యుడి వద్దకు వెళ్ళి, తనకు యోగ్యతాపత్రం ఇయ్యమన్నాడు. తన శిష్యులకు తప్ప అలాటి పత్రం ఇయ్యనన్నాడు వైద్యుడు. ఉద్రేకుడు కత్తి చూపి, యోగ్యతాపత్రం ఇయ్యకపోతే చంపుతానని బెదిరించాడు.

వైద్యుడు గత్యంతరం లేక, "ఉద్రేకు డనేవాడు అనేక ఏళ్ళుగా నా వద్ద శిష్యరికం చేసి వైద్యం నేర్చుకున్నాడు," అని పత్రం రాసి ఇచ్చాడు.

అది చూసి రాజుగారు, "నువు మందమతిలాగున్నావు. రెండు, మూడేళ్ళలో అందరూ వైద్యం నేర్చుకుంటూంటే నువ్వు అనేక ఏళ్ళు ఎందుకు నేర్చుకోవలసివచ్చింది? నీకు ఉద్యోగం ఇయ్యను," అనేశాడు.

—అవులపాటి యశోవతి





# పుకారు

ఏదైనా ముఖ్య విశేషముంటే, దాన్ని అందరికన్న ముందుగా తాను తెలుసుకుని, అందరికీ చెప్పాలని సూరప్ప ఆరాటం. ఆ తొందరలో వాడు చాలాసార్లు తప్పుడు వార్తలు ప్రచారం చెయ్యడంవల్ల వాడి మాటలు ఎవరూ నమ్మేవారు కారు. ఇది సూరప్పకు చాలా బాధ కలిగించింది. కాని వాడు తన మీద లోకులకు గల అభిప్రాయం మార్చడానికి చేసిన ప్రయత్నాలు ఫలించలేదు.

ఒక రోజు ఊళ్ళో ఏదో గొడవ జరిగింది. అలాటి గొడవలను పరిష్కరించడంలో పారుగూరి కరణంగారికి మంచి పేరున్నది. అందుకని ఊళ్లో వాళ్ళు ఆయనకు కబురు చేస్తే, మర్నాడు ఉదయం వస్తానని ఆయన చెప్పి పంపాడు.

గొడవ పడిన ఇరుపక్షాలవాళ్ళూ మర్నాడు ఉదయం పారుగూరి కరణంగారి కోసం ఒక చోట చేరి, చాలాసేపు ఎదురు చూశారు. ఎందువల్లనో ఆయన ఎంతకూ రాలేదు. చివరకు రెండు పక్షాల వాళ్ళూ తమ తమ ఇళ్ళకు వెళ్ళిపోయారు.

పారుగూరి కరణం అన్నమాట తప్పే మనిషి కాడు. ఆయన రాకపోవడానికి ఏదో పెద్ద కారణమే ఉంటుంది, అదేమిటో అందరికన్న తనే ముందుగా తెలుసుకుని, అందరికీ చెప్పాలని సూరప్ప ఆరాటపడి, మండుటెండనూ, భోజనం వేళనూ కూడా లక్ష్యపెట్టకుండా పారుగూరు బయలుదేరాడు.

ఊరి వెలపలనే సూరప్పకు ఒక శవం ఎదురయింది. దారిలో కనిపించిన ఒక మనిషితో వాడు, "ఎవరిదా శవం? మామూలుమనిషిదిలా గాలేదే?" అన్నాడు.

"ఈ ఊళ్లో ఉండే ఒక గొప్పవాడిది." అన్నాడా మనిషి.

జొన్నలగడ్డ రామలక్ష్మి

"ఈ ఊళ్లో గొప్పవాడెవరు?" అని సూరప్ప ఆ మనిషిని మళ్ళీ అడిగాడు.

"మా కరణంగారి కన్న ఈ ఊళ్ళో గొప్పవాడెవరున్నారు?" అని ఆ మనిషి జవాబు చెప్పాడు.

సూరప్పకు అంతా అర్థమైపోయింది. పాపం, ఆ ఊరి కరణంగారు పోయాడు. అందుకే ఆయన ఈ ఉదయం తగువు తీర్చటానికి తమ ఊరికి రావడం జరగలేదు!

ఈ అపూర్వ వార్త తమ ఊళ్ళో అందరికీ అందించడానికి సూరప్ప పరిగెత్తుకుంటూ వచ్చి, కనిపించిన ప్రతి మనిషికీ, "పాపం, ఈ ఉదయం పొరుగూరి కరణంగారు పోయారు! అందుకే ఆయన ఈ ఉదయం రాలేదు. శవాన్ని నేను కళ్ళారా చూశాను!" అని చెప్ప నారంభించాడు.

ఒక్కడు కూడా వాడు తెచ్చిన అద్భుత వార్తను నమ్మలేదు. సూరప్పకు చాలా బాధ కలిగింది. నిజం చెప్పినా తన మాట ఎవరూ నమ్మరెందుకు? తాను నిజం చెబుతాడని అందరికీ నమ్మకం కలిగేలా చెయ్యడం ఎలా?

"అయ్యా, కరణంగారు పోయినందుకు మన ఊరి పెద్దలు కొందరు వెళ్లి పరామర్శించి రావడం అవసరం కూడా గనక, వెంటనే బయలుదేరండి.



నిజం మీకే తెలుస్తుంది!" అన్నాడు సూరప్ప.

అలా అన్నప్పటికీ వాడి మాటలు ఎవరూ పట్టించుకోలేదు.

"ఆ ఊరి కరణంగారి శవాన్ని చూశానంటున్నావు గదా, ఆ కరణంగారు అసలు ఎలా ఉంటారో నువ్వెప్పుడైనా చూశావురా?" అని కొందరు సూరప్పను అడిగారు.

"అంత గొప్పవాడు పోతే ఆ వార్త తెలియడానికి శవాన్ని గుర్తించాలా?" అన్నాడు సూరప్ప.

తనతోబాటు, చచ్చిపోయిన పొరుగూరి కరణంగారికి కూడా తన గ్రామస్థులు

తీరని అన్యాయం చేస్తున్నారు! అందుచేత, ఆ పొరుగూరికి చెందినవాణ్ణి ఒకణ్ణి పిలుచుకు వచ్చి చెప్పిస్తే, తనపైన తన గ్రామంవాళ్ళకున్న దురభిప్రాయం వెంటనే పోతుంది.

ఇలా అనుకుని సూరప్ప మరోసారి పొరుగూరికి బయలుదేరాడు. దారిలో వాడికి ఒక పెద్ద మనిషి ఎదురయాడు. ఆయన ఫలానా గ్రామం నుంచి వస్తున్నట్టు అడిగి తెలుసుకుని, "ఈ ఉదయం మీ గ్రామ కరణంగారు చచ్చిపోయారని కనీసం మీరైనా నమ్ముతారుగా!" అన్నాడు సూరప్ప.

"నమ్మను గాక నమ్మను!" అన్నాడాయన.

"ఎందుకు నమ్మరు?" అన్నాడు సూరప్ప ఆశ్చర్యంగా.

"నేనే ఆ గ్రామకరణాన్ని గనక!" అన్నాడాయన.

సూరప్ప నిశ్చేష్టుడయాడు. వాడు ఎలాగో తేరుకుని, ఆ ఉదయం తనకూ, ఇంకో మనిషికీ జరిగిన సంభాషణ చెప్పాడు.

"అకస్మాత్తుగా ఇవాళ ఉదయం మా ఊరి పెద్ద షావుకారు పోవడంవల్ల మీ ఊరు రాలేకపోయాను. మా ఊళ్ళో నీకు తగ్గవాడు ఒకడున్నాడు. వాడు అబద్ధం చెప్పకుండానే, వినేవాడికి అబద్ధం స్ఫురించేటట్టు చెప్పగలడు. చచ్చిపోయిన వాడు గొప్పవాడన్నాడు, ఊళ్ళో నేను గొప్పవాణ్ణి అన్నాడు. ఈ రెండూ నువు జోడించుకుని, నేనే చచ్చిపోయాననుకున్నావు. నువు వాడి సంగతి తెలియక నమ్మావుగాని, మా ఊళ్ళో వాడి మాట ఎవరూ నమ్మరు," అన్నాడు పొరుగూరి కరణంగారు.

సూరప్పకు జ్ఞానోదయం అయింది. అబద్ధం స్ఫురించేటట్టు నిజం చెప్పేవాణ్ణే ఎవరూ నమ్మరంటే, నిజం తెలుసుకోకుండానే గ్రామంలో వార్తలు చెప్పే తనను ఎవరూ నమ్మకపోవటంలో ఆశ్చర్యం ఏమున్నదీ?





# దేవీ భాగవతం

## 13. కృష్ణజననం

కంసుడు వసుదేవుణ్ణి భార్యతో సహా కారాగృహంలో పెట్టి, భటులను కావలి ఉంచాడు. దేవకి గర్భంలో విష్ణువుకు పదిమాసాలు నిండాయి.

శ్రావణ బహుళ అష్టమి వచ్చింది. ఆనాడు రోహిణీ నక్షత్రం. కంసుడు బెదిరిపోతూ తన భటులతో, "ఇది ఎనిమిదో గర్భం. నాకు అపాయకరమైనది. ఈ గర్భాన పుట్టేవాడే నన్ను చంపేవాడు. వాణ్ణి చంపితేగాని నాకు నిద్ర ఉండదు. లేకపోతే సర్వనాశనం తప్పదు గనక మీరు ఎంతో హెచ్చరికగా ఉండి, పురుడు రాగానే నాతో చెప్పాలి." అని చెప్పి, ఇంటికిపోయి, మనశ్శాంతి ఏ మాత్రమూ లేనివాడయ్యాడు.

భటులు ఆయుధాలు ధరించి, ఎంతో శ్రద్ధగా కావలికాస్తున్నారు.

అప్పుడు దేవకి వసుదేవుడితో ఇలా అన్నది:

"నాకేమో ప్రసవం రాబోతున్నది. చుట్టూ రాక్షసులు కాపలా కాస్తున్నారు. మొదట నేనూ, నందుడి భార్య అయిన యశోదా మా పిల్లలను మార్చుకునేటట్టు ఏర్పాటు చేసుకున్నాం. కాని ఆ పని ఎలా చేయటం?"

ఈ మాట అంటూనే దేవకి నొప్పులు వచ్చి బిడ్డను కన్నది. పుట్టినబిడ్డ చాలా అందంగా ఉన్నాడు. దేవకి తన భర్తను దగ్గిరకి పిలిచి, బిడ్డణ్ణి చూపిస్తూ, "వీడి ముఖం కాంతీ, విశాలమైన కళ్ళూ,



మెత్తని ఒళ్ళూ చూడు! ఎవరికైనా ఇలాటి బిడ్డ పుట్టాడా! బతకని బిడ్డ బారెడు అంటారే! ఆ మాట అబద్ధం అవుతుందా? వీణ్ణి చేతులారా తీసుకు పోయి, చంపమని ఎలా ఇస్తావు?'' అన్నది.

వసుదేవుడు ఆ పిల్లవాణ్ణి చూస్తూ, ఏ మనటానికీ తోచక, అలాగే ఉండి పోయాడు. ఇంతలో ఆకాశవాణి ఇలా అన్నది: ''భటులందరూ నా మాయచేత గాఢనిద్రలో ఉన్నారు. కారాగృహంద్వారా లన్నీ తెరిచే ఉన్నాయి. నీకు అడ్డేమీ లేదు. ఈ బిడ్డను గోకులానికి తీసుకు పోయి, యశోద ఇంట ఉంచు.''

ఈ మాట వినగానే వసుదేవుడు బిడ్డను ఎత్తుకుని, బంధవిముక్తుడై, తెరిచి ఉన్న ఎనిమిది ద్వారాలూ దాటి, యోగమాయా ప్రభావంవల్ల ఎవరికంటా పడకుండా, వేగంగా కాలిందీ నదీ తీరాన్ని చేరి, ''దీన్ని ఎలా దాటటమా?'' అని ఆలో చిస్తూండగా, అందులోని నీరు మొల లోతుకు తగ్గిపోయింది. వసుదేవుడు శీఘ్రంగా గోకులం చేరి, నిర్జనమైన దారి వెంట కొంతదూరం వెళ్ళి, నందుడి ఇల్లు ప్రవేశించాడు. ఇంటి ముందు అంతులేని గోవులున్నాయి.

అప్పుడే నందుడి భార్య అయిన యశోదకు యోగమాయ కూతురి రూపంలో పుట్టింది. యశోద తన బిడ్డను వసుదేవుడి కిచ్చి, అతని కొడుకును తాను పెంచ టానికి తీసుకున్నది. వసుదేవుడు ఆ పిల్లను కారాగృహానికి తెచ్చి, దేవకి పక్కలో ఉంచి, విచారంగా కూర్చున్నాడు.

అప్పుడా బాలిక సన్న సన్నగా ఏడవ నారంభించింది. కావలివాళ్ళు కంగారు పడుతూ నిద్రలేచి, త్వరగా కంసుడి వద్దకు వెళ్ళి, దేవకి ప్రసవించిందని చెప్పారు. కంసుడు వేగంగా వచ్చి, వసుదేవుడితో, ''ఇది అష్టమ గర్భం! సాక్షాత్తూ విష్ణుమూర్తే నన్ను చంపటానికి ఈ గర్భాన జన్మిస్తున్నాడట గదా!

ఈ దుర్మార్గుణ్ణి చంపాలి గదా! ఏడీ? తీసుకురా!'' అన్నాడు.

వసుదేవుడు భయపడుతున్న వాడిలాగా వెళ్ళి, ఆడపిల్లను తెచ్చి కంసుడి చేత పెట్టాడు. కంసుడు ఆ బిడ్డను చూసి, అనుమానపడుతూ తనలో, ''ఇదేమిటి? ఛిత్రంగా ఉన్నదే! ఆకాశవాణి మాట ఎలా అబద్ధ మవుతుంది? వసుదేవుడి మాయ అయి ఉంటుందా? చుట్టూ కాపలా వాళ్ళుండగా ఆడపిల్ల ఎలా వచ్చింది? మగబిడ్డ ఏమయినట్టు? చిత్రంగా ఉన్నదే!'' అని కలవరపడుతూ, బిడ్డ కాళ్ళు పట్టుకుని, బలం కొద్దీ రాతికేసి కొట్టాడు.

కాని ఆ బిడ్డ కంసుడి చేతుల నుంచి జారి మీదికి ఎగిరి, దేవతాకారం ధరించి, మృదుస్వరంతో, ''నన్ను చంపినంత మాత్రాన ఏమవుతుందిరా, దుర్మార్గుడా! నిన్ను చంపే వీరుడు పుట్టి పెరుగుతున్నాడు. వాడు నిశ్చయంగా నిన్ను చంపుతాడు,'' అని అదృశ్యమయింది.

కంసుడికి మతి పోయినట్టయింది. అతను తన ఇంటికి తిరిగి వెళ్ళి, తన హితులైన బక, ధేనుక, వత్సక, ప్రలంబాదులతో ఇలా అన్నాడు:

''గోకులంలోగాని, మరెక్కడైనా గాని పుట్టిన పిల్లలను అనుమానించకుండా



చంపెయ్యండి. మీరందరూ నాకోసం ఏమరుపాటు లేకుండా మసలుకోండి. పిల్లలను చంపే పూతన మీకు తోడుగా ఉంటుంది.''

తెల్లవారింది. నందుడు తనకు కొడుకు పుట్టాడని ఉత్సవం చేసుకున్నాడు. ఈ వార్త నాలుగు దిక్కులా వ్యాపించింది. కంసుడి మనుషులు ఈ వార్తను కంసుడికి చేరవేశారు. ముందు నారదుడు చెప్పనే చెప్పాడు గనక కంసుడు గోకులం మీద తన ఆగ్రహాన్ని కేంద్రీకరించాడు.

గోకులంలో పెరిగిన కృష్ణుడు పూతనను చంపాడు. అసాధారణ బలంగల ధేనుకుడూ, వత్సకుడూ, బకుడూ, ప్రలం



బుడూ అతని చేతిలో చచ్చారు. అతను గోవులను రక్షించటానికి కొండను ఎత్తాడు. ఈ వార్తలన్నీ విన్న కంసుడికి తన చావు కృష్ణుడి చేతిలో ఉన్నదని రూఢి అయింది. ఆ తరవాత కేశి అనే రాక్షసుడు కూడా కృష్ణుడి చేత చచ్చినట్టు వార్త వచ్చింది.

కంసుడు ఉపాయంతో కృష్ణుణ్ణి చంపటానికి నిశ్చయించి, ధనుర్యాగం చేస్తున్నట్టు ప్రకటించి, దానికి బలరామ, కృష్ణులను పిలవ నిశ్చయించి, వారిని తీసుకురావటానికి రథం మీద అక్రూరుణ్ణి పంపించాడు.

బలరామ కృష్ణులు వచ్చారు; ధనువును విరిచారు; రాజుల నందరినీ ఓడించారు; ఏనుగును చంపారు; చాణూర, ముష్టికులనూ శలుణ్ణీ, తోశలుణ్ణీ చంపారు; కంసుణ్ణి జుట్టు పట్టుకుని కిందికి ఈడ్చి చంపారు; తమ తల్లిదండ్రులను బంధవిముక్తులను చేసి, ఉగ్రసేనుణ్ణి రాజుగా చేశారు.

తరవాత వసుదేవుడు బలరామ కృష్ణులకు ఉపనయనం చేసి, సాందీపనుడు అనే గురువు వద్ద విద్యాభ్యాసానికి పెట్టాడు. పన్నెండేళ్లు నిండేసరికి వాళ్ళు గురుకులంలో సకల విద్యలూ నేర్చుకున్నారు.

ఈ లోపల జరాసంధుడు తన అల్లుడైన కంసుడు చచ్చిపోయినట్టు తెలిసి, మధురానగరం మీదికి దండెత్తి వచ్చి, భయంకరమైన యుద్ధం చేసి, ఓడిపోయి తిరిగి వెళ్ళాడు. జరాసంధుడు ఇలా ఏడు సార్లు కృష్ణుడితో తలపడటమేగాక, మ్లేచ్ఛ రాజైన కాలయవనుణ్ణి పురికొల్పాడు. కాలయవనుడు కూడా మధుర మీదికి దండెత్తి వచ్చాడు.

అప్పుడు కృష్ణుడు యాదవుల సమక్షంలో, "దుర్మార్గుడైన జరాసంధుడు ఈ కాలయవనుణ్ణి పంపించాడు. వీడు మహాబలవంతుడు. వీడి సేన ఎంతో గొప్పది. ఈ దుష్టుడితో యుద్ధం చెయ్యటం కష్టం. ప్రాణం కాపాడుకునేటందుకు

సంపదనూ, ఇంటినీ వదిలిపెట్టటం తప్పు కాదు. ఏ స్థలంలో సుఖంగా ఉండగలిగితే అదే పిత్రార్జితం అనుకోవాలి. స్వస్థలం శాశ్వతంగా ప్రమాదకరం అయినప్పుడు కొండలూ, అడవులూ పట్టిపోయి, సుఖపడటం మేలని పెద్దలు చెబుతారు. భయంచేతనే కదా విష్ణువు సముద్రమధ్యంలో పాము మీద పడుకుంటాడు! శివుడు వెండికొండ గుహలో నివసిస్తాడు! వాళ్ళ గతే ఇలా ఉంటే, మిగిలిన వారి సంగతి చెప్పేదేమిటి? మనం వెంటనే మధురానగరాన్ని విడిచిపెట్టి వెళ్ళిపోయి, ద్వారకాపురంలో సుఖంగా ఉండటం మేలని నాకు తోస్తున్నది. ద్వారకాపురం రైవతకాద్రి సమీపంలో సముద్రతీరాన ఉన్నదనీ, చాలా అందమైనదనీ గరుత్మంతుడు చెప్పాడు,'' అన్నాడు.

ఇందుకు యాదవులందరూ ఒప్పుకుని, తమ తమ కుటుంబాలతో బలరామ కృష్ణుల వెంట బయలుదేరి, కొంతకాలానికి ద్వారక చేరి, అక్కడ శిథిలమైపోయిన ఇళ్ళను బాగుచేసి, అక్కడ నివసించసాగారు. మధుర నిర్జనమయింది. అయితే బలరామ కృష్ణులు ఆ నిర్జనమైన మధురకు తిరిగివచ్చి, అక్కడ ఉంటూండగా కాలయవనుడు తిరిగి మధురను ముట్టడించాడు.



అప్పుడు కృష్ణుడు నగరం వదిలిపెట్టి, కాలి సత్తువకొద్దీ పారిపోసాగాడు. అది చూసి యవనుడు కృష్ణుడి వెంట పడ్డాడు. ఇద్దరూ ముచికుందుడనే ముని ఆశ్రమం చేరారు. కృష్ణుడు ఆశ్రమంలో దాక్కున్నాడు. నిద్రపోతున్న ముచికుందుణ్ణి కాలయవనుడు కాలితో తన్నాడు. వెంటనే ముని లేచి, తన చూపుతో కాలయవనుణ్ణి భస్మం చేశాడు.

తరవాత కృష్ణ, బలరాములు ద్వారకకు తిరిగి వెళ్ళి, ఉగ్రసేనుడి పరిపాలనలో సుఖంగా ఉంటూ వచ్చారు.

తరవాత కృష్ణుడు శిశుపాలుణ్ణి ఇష్టం లేకుండా పెళ్ళాడవలసిన స్థితిలో రుక్మి



ణిని రక్షించి, రాక్షస వివాహ విధిని ఆమెను తానే పెళ్ళాడాడు. జాంబవతీ, మిత్రవిందా, సత్యభామా, నాగ్నజితీ, భద్రా, లక్షణా, కాళిందీ కూడా కృష్ణుడికి భార్యలయారు.

కొంత కాలానికి కృష్ణుడికి రుక్మిణి యందు ప్రద్యుమ్నుడు అనే కొడుకు కలిగాడు. ఆ కుర్రవాడికి బారసాల చేసిన అనంతరం శంబరుడనే రాక్షసుడు పురిటిబిడ్డను కాజేసి తీసుకుపోయి తన కూతురైన మాయవతికి ఇచ్చాడు.

కృష్ణుడు ఏమి చెయ్యటానికీ లేక జగదంబను ధ్యానించి ఇలా అన్నాడు: "తల్లీ, కనపడకుండా ఎవడో దుష్టుడువచ్చి పురిటింట ఉన్న నా కొడుకును కాజేశాడు. నా పరువు కాస్తాపోతుంది. నీ దాసుణ్ణి నేను ఈ దీనస్థితిలో ఉండటం నీకు మాత్రం సిగ్గు కాదా? నా ఇల్లు నగరం మధ్యలో ఉన్నది. నగరం చుట్టూ కోట ఉన్నది. పురిటింటికి చుట్టూ కాపలా ఉన్నది. పిల్లవాడు ఎలా పోయాడు? ఇదంతా నా ప్రారబ్ధమే గదా! నేను పొరుగూరు వెళ్ళినా, యాదవులంతా కాస్తూనే ఉన్నారు. నీ మాయాబలం సహాయంలేకుండా నా కొడుకును ఎవడు కాజెయ్యగలడు? నాకు కొడుకునిచ్చి ఆనందం కలిగించిన నువే నాకీ మనోవేదన కలిగించటం భావ్యమా? నా కొడుకును నాకు మళ్ళీ చేర్చు. నేను నీకు పగవాడనా?"

ఇలా పరితపించే కృష్ణుడి ముందు దేవి సాక్షాత్కరించి, "శాపకారణం చేత నీ కొడుకు శంబరుడి చేత అపహరించబడి, అతడి ఇంట ఉన్నాడు. పదహారో ఏట వాడు శంబరుణ్ణి చంపి, నీ వద్దకు తిరిగి వస్తాడు. విచారించకు." అన్నది.

ఆ మాట విని కృష్ణుడూ, రుక్మిణీ విచారం మానారు.

నారాయణాంశతో పుట్టిన కృష్ణుడికి అంతుబట్టకుండా, రహస్యపు గదిలో ఉన్న పిల్లవాణ్ణి శంబరుడు ఎలా హరించ

గలిగాడు? ఇందులో వింత ఏమీలేదు. దేవి మాయను మనుషులే కాదు, దేవతలూ, దానవులూ కూడా అధిగమించలేరు. అరణ్యంలో తనకు బంగారు లేడి దాపరిస్తుందనీ, తన భార్యను ఎత్తుకుపోతారనీ తెలుసుకోగలిగాడా రాముడు? అతనికి తన తండ్రి చావు గురించి ఎవరో చెప్పినదాకా తెలియదే! అఖరుకు సీత ఫలానా చోట ఉన్నదని కూడా రాముడు తెలుసుకోలేకపోయాడే! తన కొడుకులైన కుశలవులను వాల్మీకి పరిచయం చేసినదాకా తెలుసుకోగలిగాడా?

మానవ శరీరం ధరించినాక మానవ ధర్మాలు ఎవరికీ తప్పవు. అందుకే కృష్ణుడు పుట్టుతూనే కంసుడి భయంతో గోకులంలో దాక్కున్నాడు, పెద్ద అయి జరాసంధుడి భయంతో, బంధువులతో కలిసి ద్వారకలో తల దాచుకున్నాడు. శిశుపాలుడికి భార్య కావలసిన రుక్మిణిని ఎత్తుకు రావటం కృష్ణుడు చేసిన అన్యాయమే కదా!

మానవ సహజమైన పనులు కృష్ణుడు ఎన్నయినా చేశాడు. భార్యావిధేయుడై సత్యభామ అడిగిందని, కృష్ణుడు స్వర్గం నుంచి పారిజాత వృక్షాన్ని ఎత్తుకు రావటానికి ఇంద్రుడితో యుద్ధం చేశాడు. జాంబవతి కొడుకులు కావాలని కోరితే, అతను పుత్రుల కోసం ఉపమన్యుడి ఆశ్రమంలో తపస్సు చేశాడు. దానికోసం పాశుపత దీక్ష పూని, శివుణ్ణి గురించి కృష్ణుడు తపస్సు చేస్తే, శివుడు పార్వతీ సమేతుడై ప్రత్యక్షమై, కృష్ణుడి కోరిక తెలుసుకుని, "నీకు పదహారు వేల యాభైమంది భార్యలుంటారు. ఒక్కొక్కరికి పదేసి మంది పిల్లలు పుట్టుతారు. నువు నూరేళ్ళు బతుకుతావు," అని ఆశీర్వదించాడు.

తరవాత కృష్ణుడు ఉపమన్యుడికి మొక్కి, సెలవు తీసుకుని, ద్వారకకు తిరిగివచ్చి సుఖంగా ఉన్నాడు.

అందుచేత ఒక్క మహాదేవి తప్ప, మాయాకు లోబడని వారు ఎవరూ లేరు.





# చీనాంబరాలు

మూడు వేల సంవత్సరాల క్రితం చీనా చక్రవర్తి ఒక అందమైన అమ్మాయిని పెళ్ళాడాడు. ఆమె పేరు సీలింగ్‌షీ. ఆమె వయస్సు పధ్నాలుగేళ్ళు. చీనా చక్రవర్తికి పట్టపురాణి అయిన సీలింగ్‌షీకి ఏ లోటూ లేదు. రోజల్లా ఆమెకు వినోదం కలిగించటానికి గాయకులూ, నర్తకులూ ఉండేవారు. ఏమి కావలసినా చేయటానికి పరిచారికలు వుండేవారు.

కాని ఇన్నీ ఉండి కూడా సీలింగ్‌షీకి పెద్ద విచారం పట్టుకున్నది. ఆమె కళ్ల వెంట నిరంతరం అశ్రుధారలు కారసాగాయి. ఆమె దుఃఖాన్ని బాపటానికి ఎందరో యత్నించారు. కాని లాభం లేకపోయింది. ఆమె దుఃఖానికి కారణమేమంటే, ఆమె ఎన్నడూ తన పుట్టింటి వారిని విడిచి ఉండినది కాదు. అందులోనూ చిన్నపిల్ల. దూరాన ఉన్న తన తలిదండ్రులనూ, అన్నదమ్ములనూ తలుచుకుని ఆమె ఎల్లవేళలా కుమిలిపోసాగింది.

తన పట్టమహిషి చింతాక్రాంతురాలై ఉన్నదన్న వార్త చక్రవర్తికి తెలిసి, తన ఇద్దరు మంత్రులతో సహా ఉద్యానవనానికి వచ్చాడు. తోటలో కంబళీవృక్షం నీడను కూర్చొని ఉన్న తన భార్యను సమీపించి, "రాణీ, నీకేమి లోటు జరిగింది? నీ లేత బుగ్గలు తడిగా ఉన్నాయి దేనికి? నీ ఆరోగ్యం బాగా లేదా? దాచక చెప్పవలసింది," అని అడిగాడు.

"స్వామీ, నాకే లోటూ లేదు. మీరు విచారించకండి. నా మనసుకు ఉల్లాసంగా లేదు. అంతకంటె మరేమీ లేదు," అన్నది సీలింగ్‌షీ.

మహారాజు తన మంత్రుల కేసి చూసి, "మీరు త్వరలోనే మహారాణి మనసుకు

**25 ఏళ్ళనాటి చందమామ కథ**



ఉల్లాసం కలిగించే యోచనలు చేయండి." అని వెళ్ళిపోయాడు.

తమలో తాము మాట్లాడుకుంటూ మంత్రులు కూడా వెళ్ళిపోయారు.

ఇంతలోనే పరిచారికలు తేనీరు తెచ్చి మహారాణి ముందు పెట్టారు. ఆమె ఆచారం ప్రకారం తానే స్వయంగా తేనీరు గిన్నెలలో కలిపి పాటగాళ్ళకూ, ఆటగాళ్ళకూ ఇచ్చి తన గిన్నె ముందుంచుకున్నది. తేనీరు చాలా వేడిగా ఉండటం చేతనో, దాని మీద అంతగా ఇచ్ఛకలగకనో ఆమె దానిని వెంటనే తాగలేదు.

ఈ సమయంలో కంబళీవృక్షం మీద నుంచి ఏదో వస్తువు మహారాణి తేనేటి గిన్నెలో టప్‌మని పడింది. తేనీరు చింది అమూల్యమైన మహారాణి దుస్తులపై పడింది. పరిచారికలు నొచ్చుకుంటూ ఆమెను సమీపించబోయారు.

"నా దుస్తుల కేమీ తొందరలేదు. గిన్నెలో పడిన వస్తువేమిటో చూడండి," అన్నది మహారాణి.

పరిచారికలు గిన్నెలోని తేనీటి నుంచి చిన్న దారపు ఉండలాటి పదార్థాన్ని తీసి మహారాణి చేతిలో పెట్టారు. అది మరేమీ కాదు. పట్టుపురుగులు కంబళీ వృక్షాల మీద పెట్టే గుడ్డు తాలూకు పిసినికాయ. అలాటి పిసినికాయలు కంబళీ వృక్షం మీద ఇంకా అనేకం ఉన్నాయి.

తేనీటిలో పడిన పిసినికాయను పరిచారికల వద్ద నుండి తన చేతిలోకి తీసుకొనే సమయాన సీలింగ్‌షీ ఒక వింత గమనించింది. ఆ పిసినికాయ విచ్చుకుని అతి సన్నని, నిగనిగలాడే పోగులు చేతిలోకి రాసాగాయి.

"ఆహా! ఇదే దారమైతే దీనితో నేసిన వస్త్రాలు ఎంత అందంగా ఉండాలి!" అనుకున్నది సీలింగ్‌షీ.

మరుక్షణమే ఆమెకొక ఆలోచన తట్టింది. ఈ పోగులు మరీ సన్నగా ఉన్న మాట నిజమేగాని ఇవి సులువుగా తెగటం లేదు. అదీగాక ఈ ఒక్క పిసినికాయ

లోనే ఎన్నో వేల గజాల పోగులు వున్నట్టు కనిపిస్తున్నది. ఈ పోగును అనేక పేటలు వేసి పేనినట్టయితే దారం తయారవుతుంది. అప్పుడు దానిని మగ్గం మీద నేసి, ప్రపంచంలో ఎవరూ ఎన్నడూ చూడనంత అందమైన బట్టలు తయారు చేయవచ్చు.

ఈ ఆలోచన రాగానే మహారాణి మనోవ్యాధి కాస్తా మటుమాయమయింది. ఆమె ఉత్సాహంతో లేచి తన పరిచారికలను పిలిచి, తన చేతిలో వున్న పోగును విప్ప దీసి పేటలు వేసి పేనమని చెప్పింది. పరిచారికలు ఆమె చెప్పినట్టే సన్నని, నిగనిగలాడే దారం పేని పుల్లలకు చుట్ట సాగారు.

"ఇట్లా ఎంత దారమైతే ఒక బట్ట కాను? మీరంతా కలిసి చెట్టు మీద వున్న పిసినికాయలన్నీ ఏరి తెచ్చి తేనీటిలో వెయ్యండి," అని మహారాణి పరిచారికలను ఆజ్ఞాపించింది.

ఎవరికీ క్షణం తీరికలేదు. అదివరకు పనిపాటలు లేక క్షణమొక యుగంగా గడిపిన మహారాణి కిప్పుడు ఘడియలు క్షణాలలాగా సాగిపోతున్నాయి. సూర్యాస్తమయే లోపల చాలా కండెల దారం తయారయింది. ఇంకా చేయవలిసిన పని బోలెడంత ఉన్నది. ఆమె వడ్రంగులను పిలిపించి, "ఈ దారం చూడండి! ఇంత సన్నని దారం నేయటానికి వెంటనే మగ్గం తయారుచేయండి. తెల్లవారేలోగా మగ్గం





తయారయి నా గదిలో ఉండాలి,'' అని ఆజ్ఞాపించింది.

మర్నాడు చక్రవర్తి తన మంత్రులను పిలిపించి, ''పట్టపురాణి మనను ఉల్లాసంగా ఉండటానికి ఏమాలోచించారు ?'' అని అడిగాడు.

''చిత్తం, ప్రభూ ! ఒక చక్కని నెమిలిని తెచ్చి మన ఉద్యానవనంలో వుంచినట్టయితే దేవిగారు దాని నాట్యం తిలకిస్తూ, దాని ఈకల రంగులు చూసి వినోదిస్తూ....'' అని ఒక మంత్రి గొణిగాడు.

చక్రవర్తి రెండో మంత్రి కేసి చూశాడు.

''మన ఉద్యానవనంలో జలక్రీడలకు చిన్న తామరకొలను ఏర్పాటు చేసినట్టయితే మహారాణిగారు, తన చెలికత్తెలతో అందులో ఈతలు కొడుతూ—'' అన్నాడు రెండో మంత్రి.

తన ఇద్దరు మంత్రులకూ సరి అయిన ఆలోచన తోచలేదని తెలుసుకుని చక్రవర్తి తన పట్టపురాణిని పిలవ నాజ్ఞాపించాడు.

''ప్రభూ ! మహారాణిగారింకా తమ గది నుండి బయటికే రాలేదు.'' అన్నారు నౌకర్లు.

''ఇంత పొద్దెక్కి ఇంకా బయటికే రాలేదా ?'' అన్నాడు చక్రవర్తి. అర్భకురాలైన తన ప్రియభార్య ఆరోగ్యం గురించి ఆయనకు ఆందోళన కలిగింది. ఆయన వెంటనే సింహాసనం దిగి సరాసరి రాణి గదికి వెళ్ళాడు.

చక్రవర్తి లోపల అడుగు వేస్తూనే చూసిన దృశ్యం ఆయనకు ఆశ్చర్యమూ, ఆనందమూ కలిగించింది.

మహారాణి విచారసాగరంలో మునిగి ఉండకపోగా, ఒక విచిత్రమైన మగ్గం ముందు కూచుని ఎన్నడూ కనని, విననంత అందమైన దారపు పోగులతో ధగధగ మెరిసిపోతున్న, ఒక నాజూకైన వస్త్రం నేస్తున్నది.

మహారాణి తల ఎత్తి చక్రవర్తి కేసి చూసింది, ఆమె కళ్ళు ఆనందంతో మెరుస్తున్నాయి, చిరునవ్వు నవ్వింది.

"మహాప్రభూ! నా విచారంతో మీకు ఎంతో కాలంగా బాధ కలిగించాను. దానికి పరిహారంగా మీకీ దేవతావస్త్రం నేసి ఇస్తున్నాను. ఆగ్రహించరు కద?" అన్నదామె.

"ఆగ్రహమా? ఇంత అపూర్వమైన వస్త్రం బహుమతి పొందుతూ ఆగ్రహించగలనా?" అన్నాడు చక్రవర్తి.

సీలింగ్‌షీ తన భర్తతో జరిగినదంతా చెప్పింది.

"తమ భార్యగా వుండి నేను పని చెయ్యటం భావ్యం కాదు. అందుచేత ఈ సంగతి రహస్యంగా ఉంచాను," అన్నది మహారాణి.

"దానికి నాకేమీ విచారం లేదు. నీ మనసుకు తృప్తి కలిగించినవారికి అర్ధ రాజ్యం ఇవ్వటానికి కూడా సిద్ధపడ్డాను. నీ విచారం తొలగిందే నాకు పదివేలు," అన్నాడు చక్రవర్తి.

"అయితే, మహాప్రభూ! నా కోరిక ఒకటి నెరవేర్చండి," అన్నది మహారాణి.

"నీ యిష్టం వచ్చింది కోరుకో!" అన్నాడు చక్రవర్తి.

"వెయ్యి కంబళీవృక్షాలతో నా కొక తోట వేయించి పెట్టండి!" అన్నది మహారాణి. చక్రవర్తి ఆమె కోరిక నెరవేర్చాడు.

సీలింగ్‌షీ ప్రపంచంలో మొట్టమొదటి పట్టువస్త్రాలు నేసింది. ఇప్పటికీ చీనా భాషలో 'సీ' అంటే పట్టు. ఆమె అనంతరం చీనాదేశపు మహారాణులు ఆమె ఏర్పాటు చేసిన సంప్రదాయాన్ను సరించి, ఏటా ఒక రోజు పట్టుపురుగులకు తమ చేతిమీదుగా ఆహారం వేస్తూవచ్చారు.

కాలక్రమాన పట్టువస్త్రాల రహస్యం చీనా నుంచి ఇతర దేశాలకు పాకింది. అందుకనే మన పూర్వీకులు పట్టువస్త్రాలను చీనాంబరాలనేవారు. మిగతా దేశాలలో పట్టువస్త్రాలు తయారయినా కూడా చీనాదేశపు పట్టువస్త్రాలకు గణ్యత ఉన్నది. వీటిని మనవారు చీని చీనాంబరాలనేవారు.



## ఫోటో వ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 25 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1979 డిశెంబర్ నెల సంచికలో ప్రకటింపబడును.







Brahm Dev

Chandrpal Singh

★ పై ఫోటోలకు సరిఐన వ్యాఖ్యలు ఒక్క మాటలోగానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.)

★ అక్టోబర్ నెల 20-వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంతమాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 25/—లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన రాసి, (వ్యాఖ్యలకు సంబంధించని ఇతర విషయాలేవీ చేర్చరాదు.) ఈ అడ్రసుకు పంపాలి:—చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు—26.

## అగస్టు నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో: పిడికెడు భిక్షకు

రెండవ ఫోటో: ఎంతదూరం తిరగాలో

పంపినవారు: సి. సాయిలక్ష్మి, హౌస్ సర్జన్, మెడికల్ కాలేజ్, తిరుపతి.

బహుమతి మొత్తం రు. 25/—ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.

Printed by B. V. REDDI at Prasad Process Private Ltd., and Published by B. VISWANATHA REDDI for CHANDAMAMA CHILDREN'S TRUST FUND (Prop. of Chandamama Publications) 2 & 3, Arcot Road, Madras-600 026 (India). Controlling Editor: NAGI REDDI.

# శత్రు సంహారం!































*కార్బాక్సిలిక్ యాసిడ్ గ్రూప్ ఫార్ములా— పళ్ళ ఎనామెల్‌ను నష్టపరిచి, బాధను కలిగించే పిప్పి పళ్ళను కలిగించేది.

గట్టి పళ్ళకోసం, పిప్పిపళ్ళు రాకుండా నిరోధించడంకోసం—బినాకా ఫ్లోరైడ్.

ధరించండి
ఈ దీపావళికి
తేలికగా ఉండే,
ఉల్లాసాన్నిచ్చే కొత్త

# కరోనా

పాదరక్షలు





స్వీటీ



మోహిని



దిలీప్ వెడ్జ్



సెన్సేషన్



గేలార్డ్-190




తయారుచేయువారు:
**కరోనా సాహు కం. లి.**
రిజిస్టర్డ్ ఆఫీస్:
221, దాదాభాయ్ నౌరోజీ రోడ్,
ఫోర్ట్, బొంబాయి 400 001.

CHAITRA-CS-171 TEL